# ఉచిత కానుక!

# గ్లూకోన్-డి యొక్క తక్షణ శక్తితోపాటుగా




# ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్నీ, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్ళరసం, పాలు, టీనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

HTB-GLL-9686







స్టాకు పరిమితం, నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

తక్షణ శక్తి కోసం-గ్లూకోన్-డి

మంచి ఆరోగ్యానికి మూలస్థానం
గ్లాక్సో

## రుచిచూస్తే తెలుస్తుంది:

# మేము వుపయోగించిన వస్తువులు ఆ ప్రత్యేకతకి కారణం.

ప్రకృతి సిద్ధమైన మూల పదార్థాలు. అందుచేతే ట్రూ బిస్కట్లకి లభించాయి— స్వచ్ఛత, పోషకత్వం, సంపూర్ణత్వం. ట్రూ బిస్కట్లు. అరగించి ఆనందించడానికి....ఇతరులతో పంచుకోడానికి....ఇతరులకి ఇవ్వడానికి....అందరికీ కావలసిన అనేకరకాలు.

**ట్రూ బిస్కట్**

TRUE Glucose — with the extra energy of honey

TRUE NICE BISCUITS

TRUE marie BISCUITS

Scrunch TRUE biscuits

TRUE yelakkai CUSTARD CREAM




**హనీ గ్లూకోజ్**

గ్లూకోజ్ మరియు స్వచ్ఛమైన తేనెతో శక్తినిచ్చే బిస్కట్.




**నీస్**

సహజమైన కొబ్బరి కురిడీతో చేసి పంచదార జల్లిన రుచికరమైన బిస్కెట్.




**మారీ**

అన్ని వేళలకి. కాఫీ త్రాగేటప్పుడు, టీ తీసుకునేటప్పుడు లేక ఏ సమయంలోనయినా.




**స్క్రంచ్**

మింట్ చేరిన తియ్యని, కరకరలాడే చాక్‌లెట్ క్రీమ్ బిస్కెట్.

**ఏలక్కాయ క్రీమ్ కస్టర్డ్**




పోషకత్వం కలిగి, గట్టిగావుండే కస్టర్డ్ క్రీమ్ మరియు ప్రకృతిసిద్ధమైన ఏలక్కాయలతో రుచికరమైన కలయిక. అరగించడానికి, అందించి ఆనందించడానికి.

AFL - 1432

## వాలుగు కాళ్ళ కోడి !

16–3–84 తేది పత్రికలో 37వ ౦జీలో ''సుసర్ల'' వేసిన కార్టూన్ చూసి, ౦౦దస్మితము చేయబోయి కోడికి నాలుగు ళ్ళుండడముతో పక్కున నవ్వాను.

కుంకాల సీతారామ్, గుంతకల్లు.

## క ర్మ యో గి

డాక్టర్ కె. వి. కృష్ణకుమారిగారు డాక్టరై ౦౦డి కర్మసిద్ధాంతాన్ని చాల చక్కగా వివరిస్తు న్నారు 'కర్మయోగి'లో. బాగుందని మెచ్చు ౦వాలో ఒక డాక్టర్ ఇటువంటి రచన సేస్తున్నందుకు విచారించాలో తెలియకుండా ౦౦ది.

ఎస్. ఇందుముఖి, హైదరాబాద్.

## స ప్త సం ఖ్య

శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి ధర్మపథం చదివాను. అందులో రచయిత సప్త సంఖ్య గురించి చాలా వివరముగా విశదీకరించడ మైనది. నిజంగా ఆ సంఖ్యపై చాలమంది తెలుగు వారికి దురభిప్రాయమున్నది.

బూరేల నారాయణస్వామి, హిందూపురం

## ఈ రాగానికదే తాళం

'ఈ రాగానికదే తాళం' చక్కిలం విజయలక్ష్మిగారు రచించిన కథ చాలా బాగుంది.

చిట్టిప్రోలు వెంకటసుబ్బమ్మ, మాచవరం.




## వ్యక్తిగతం

ఆంధ్రసచిత్ర వారపత్రిక 6–4–84 సంచికలో ''వ్యక్తిగతం'' శీర్షిక క్రింద శ్రీ విష్ణుదాస్ షిరాలీ నిధనం గురించి వ్రాస్తూ ''వారు 1967 లో ఫిలిం డివిషన్ నుంచి రిటైరయ్యారని వ్రాశారు.''

అది 'తప్పు' అని గమనించ ప్రార్థన. వారు 1963 లో రిటైరు కాగా, వేణుగాన విద్వాంసులు (మన తెలుగు వారే !) శ్రీ విజయ రాఘవరావుగారు ఆ స్థానంలోనే, ''ప్రముఖ సంగీత దర్శకులు''గా చేరారని గమనించ ప్రార్థన.

డాక్టర్ రేవతి సుబ్రహ్మణ్యం, బొంబాయి.

**పాఠకులకి మనవి**

స్థలాభావంచేత ఈవారం కొన్ని మామూలు శీర్షికలు వెయ్యలేకపోతున్నందుకు చింతిస్తున్నాము. — సం.

## శ్రీ రెంటాల వెంకట సుబ్బారావు గారు – కొన్ని విశేషములు

శ్రీ పంతులుగారిని గురించి 1918 మార్చి నెలలో ఆంధ్రపత్రికలో ప్రకటించబడిన వ్యాసం ఈ మధ్య ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పునర్ముద్రితమయింది. ఆ వ్యాసంలో లేని విషయాలు కొన్ని నేనెరిగిన పాఠకులకు తెలుప వలెననే ఉద్దేశంతో దీనిని వ్రాస్తున్నాను.

వెంకట సుబ్బారావుగారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు. వకీలు వృత్తిలోవలెనే సారస్వతం లోనూ, ఇతర వ్యాపార మార్గంలోనూ మిక్కిలి ఆసక్తి ఉన్నవారు. మద్రాసు మైలాపూరులో కపాలీశ్వరుని కొలను ఉత్తర తీరానగల వారి నివాసం ''రెంటాల హౌస్'' ఆ చుట్టుప్రక్కల ఉన్న భవనాలన్నింటికంటే మిక్కిలి పెద్దది. అతిధులు, అభ్యాగతులు వచ్చి తృప్తిగా భుజించి వెళ్లేవారు పండితులు, గాయకులు సత్కారాలు పొందేవారు.

ఆయన వ్రాసిన సులభగ్రాహ్య గ్రంథాలు (మేడ్ ఈజీ సీరీస్) దేశమంతటా వ్యాప్తి పొందాయి. నేను మొదట ఆంగ్ల భాషాభ్యాసం ప్రారంభించినది ఆయన ''ఇంగ్లీషు భాషా మంజరి''తోనే ! అందులో పాఠాలు విషయ క్రమంలో ఉండేవి. అన్నిటి లోనూ ఇంగ్లీషు

[66వ పేజీ చూడండి]

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 11-5-'84

శ్రీ రక్తాక్షినామ సం. వైశాఖ శు. ఏకాదశి

**సంపుటము 76 : సంచిక 35**

**సంపాదకుడు :**

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్ట్‌లో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.




చిత్రం :
నటి ఊర్వశి
: పి. రవిచందర్
లు :

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# భుట్టో బుర్ర - గడ్డాఫీ డబ్బు

హత్యల మాట వస్తే లిబియా పాలకుడు కర్నల్ ముఅమ్మార్ గడ్డాఫీ హూణరాజు అత్తిలాకి ఏమీ తీసిపోడు. అయితే మాత్రం ఏమిటి? శ్రీమతి గాంధీకి శాంతి అంటే చాలా ప్రేమ— కనీసం శాంతి నోబెల్ బహుమతి మీద ప్రేమ— కాబట్టి ట్రిపోలీ వెళ్లి ఆయనని కలుసుకున్నారు. కలుసుకోవటమే కాదు ఆయన్ని బాగా ప్రశంసించారు. శ్రీమతి గాంధీ ప్రకారం ఆయన ఒక శాంతి దూత. "మానవ జాతికి హాని చేసే మూడు చెడులు — తీవ్రవాదమూ, హింసా, ఆర్థిక దుర్వినియోగమూ అని మీరు అన్నారు." అని శ్రీమతి గాంధీ ఆయనకి చెప్పారు. ఆయనకి ఇదంతా తెలీదనా? నువ్వు ఒక అబద్ధాల కోరువి, అని శ్రీమతి గాంధీ అన్నట్లే కదా! ఈయన [గడ్డాఫీ] ఖొమెయినీ కన్నా పెద్ద తీవ్రవాది. ఇది సాధ్యమా, అని మీరు అనుకోవచ్చు కాని గడ్డాఫీ నిజంగా అలాంటివాడే. గడ్డాఫీ మనుషులు భూగోళం అంతా తిరుగుతూ ఉంటారు: తుపాకులూ, బాంబులూ కొని కాఫిర్ల మీద ప్రయోగించేందుకు. ఈజిప్టు అధ్యక్షుడు సాదత్‌ని చంపించినది ఈయనే. సూడాన్ నాయకుడు నుమెయిరీని కూడా చంపించాలని చూస్తున్నాడు ఈయన. ఇంకా ఆయన హత్యా ప్రయత్నాలకి గురి అయినవారు ఎందరో తెలీదు. ఇలాంటి పెద్దమనిషి, ఇతర దేశాల వాళ్లతో "మీరు మీ అణ్వస్త్రాల సంఖ్యని తగ్గించుకోవాలి!" అని చెబుతాడు.

శ్రీమతి గాంధీకి నోబెల్ శాంతి బహుమతి మీద అంత ప్రేమ అయితే దానిని కొనుక్కోవచ్చు కదా? హెన్రీ కిసింగర్ చేసిన పని ఇదే కదా? స్వీడెన్‌లో నోబెల్ బహుమతుల వాళ్లకి చెబితే వాళ్లు "సరే" అనకుండా ఉంటారా? గడ్డాఫీని వదిలించుకోవాలంటే ఇదొక మార్గం కదా? ఈవిడకి అమృత్‌సర్ వెళ్లేందుకు తీరిక లేదు. ఉత్తర ఆఫ్రికా దేశాలకి వెళ్లి అక్కడి వాళ్లని కొందరిని తటస్థదేశాల ఉద్యమంలో గొప్ప వాళ్లు మీరు అనటానికి మాత్రం తీరిక ఉంది ఆమెకి. శ్రీమతి గాంధీ కాని, కర్నల్ గడ్డాఫీ కాని తటస్థంగా ఉండేది ఒక సత్యం విషయంలో మాత్రమే.

బయలుదేరేముందు శ్రీమతి గాంధీ లిబియాని ఒక మిత్రదేశంగా అభివర్ణించారు. ఈ మిత్రదేశాన్ని పాలించే వ్యక్తి "మహమ్మదీయ బాంబు" కోసం తన కుడిచేతిని కోసి ఇవ్వగలడు. ఆ బాంబు చేజిక్కించుకుని ఆయన మనని ఎలాగ బెదిరిస్తాడో చూడాలి. పాకిస్తాన్‌లో తయారయిన అణుబాంబుకి "తండ్రి" కాదర్‌ఖాన్ కాదు గడ్డాఫీయే. పాకిస్తాన్ బాంబు పథకం ఆయన సృష్టించినదే. హాలాండ్‌లోని "ఉన్‌రెకో" అణ్వస్త్రం ప్రాజెక్టులోకి కాదర్‌ఖాన్‌కి ప్రవేశం కల్పించింది ఈయనే కదా? మూడేళ్లకింద నేను హాలాండ్ వెళ్లినప్పుడు నేను కలుసుకున్న వాళ్లందరూ దాన్ని గురించే మాట్లాడేవాళ్లు— పాకిస్తాన్‌తోబాటు భారతదేశాన్నీ తిట్టేవాళ్లు. రెండూ ఒకే దేశం అని వారి అభిప్రాయం! స్థానిక లేబర్‌పార్టీ నాయకుడికి అతి కష్టంమీద వివరించి చెప్పాను, భారతదేశానికి కాదర్‌ఖాన్‌తో సంబంధం లేదని.

"డాక్టర్ ఖాన్ భారతదేశంలో పుట్టాడే!" అన్నాడు లేబర్‌పార్టీ నాయకుడు. (ఆయన పేరు మర్చిపోయాను!)

కర్నల్ గడ్డాఫీ



మహమ్మదలీ జిన్నా, జియా-ఉల్-హక్‌లు కూడా భారతదేశంలోనే కదా పుట్టారు? భుట్టో ఇక్కడ పుట్టడమే కాకుండా చాలాకాలం దాకా భారతదేశం పాస్‌పోర్ట్‌నే ఉంచుకున్నాడు.

భుట్టో పేరు వింటే ఆయన కుమార్తె బెనజీర్ పేరు జ్ఞాపకం వస్తుంది. ఆవిడ ఏదో ఒక "జోన్ ఆఫ్ ఆర్క్" లాంటి వీరవనిత అన్నట్లు హడావుడి చేస్తున్నారు మనవాళ్లు. పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించటానికి తాము కృషి చేస్తున్నామని ఆవిడ జర్నలిస్టులతో చెప్పినప్పుడెల్లా నాకు నవ్వు వస్తూ ఉంటుంది. భుట్టో కాలంలో ఆ దేశంలో ప్రజాస్వామ్యం ఏ మాత్రం వర్ధిల్లింది? అసలు భుట్టో, జియా — ఇద్దరూ ఫాసిస్టులే. వాళ్లు చెప్పేవన్నీ ఫాసిజానికి దారితీసే సిద్ధాంతాలే.

భారతదేశంతో 1000 సంవత్సరాలు యుద్ధం చేస్తామని అన్నది ఎవరు? జియా కాదు, భుట్టో! పాకిస్తాన్‌కి అణుబాంబు తయారుచేసే సామర్థ్యం కలగటానికి తోడు పడింది జియాకాదు భుట్టోయే. భుట్టో అమెరికాలో చదువుకున్నాడు. అందుచేత తను ఏదయినా అమ్మాలనుకుంటే అమ్మటం నేర్చుకున్నవాడు. గడ్డాఫీకి "మహమ్మదీయ బాంబు" పథకాన్ని అమ్మాడు. డబ్బు గడ్డాఫీదీ, బుర్ర భుట్టోదీ. ఇద్దరూ కలిసి పనిచేశారు.

భారతదేశంలోని పత్రికలు కొన్ని తమ అమ్మకాలు పెంచుకునేందుకు బెనజీర్ బొమ్మలు వేస్తూ ఉంటాయి. నాకు మాత్రం ఆవిడ విషయంలో భ్రమలు లేవు. "మన శత్రువు యొక్క శత్రువు మన మిత్రము" అనటం తేలిక. కాని ఇద్దరు శత్రువులూ కలసి మనకి ఎదురు తిరిగితే? అణుబాంబు చెయ్యకపోతే ప్రమాదం, అని బెనజీర్ అమెరికా వాళ్లతో వాదించిందిట. అంటే, బాంబూ— ప్రజాస్వామ్యం ఒకటేనా? పాపం జియా ఒక బాంబు తీసి బెనజీర్ తలమీద వెయ్యలేదు. [కాని మహమ్మదీయ మహానాయకులు కొందరు ఇంకొక అస్త్రాన్ని కనిపెట్టారు — అదే ఉరితాడు ఈ ఉరితాడుని బెనజీర్ మీద ఉపయోగించగలడేమో జియా.] అలాగే బెనజీర్

(63వ పేజీ చూడండి)

# వ్యక్తిగతం



రుమానియా అధ్యక్షుడు శ్రీ కొసెస్కొ సతీమణి శ్రీమతి ఎలెనా పుట్టిన రోజుకి 80 వ్యాసాలూ, 38 కవితలూ, 3 ప్రశంసల సంపుటాలూ ప్రచురించబడ్డాయిట. 22 చిత్రపటాలూ, శిల్పాలూ సృష్టించబడ్డాయిట. టి. వి. మీద ప్రత్యేక కార్యక్రమాలు ప్రసారం చేశారుట. అధ్యక్షుడి సోదరుడు ఇలిమెని రుమానియా సేనల "రాజకీయాధిపతి"గా నియమించారుట. ఆయన రక్షణ శాఖలో ఉపమంత్రిగా కూడా పనిచేస్తున్నారుట. ఇంకొక సోదరుడిని ఆంతరంగిక సైనిక సంస్థకి "రెక్టార్"గా నియమించబడ్డారుట. ఇక శ్రీ కొసెస్కొ కుమారుడు శ్రీ నిచునియువ కమ్యూనిస్టుల సార్వత్రిక కార్యదర్శిగా ఎన్నుకున్నారుట. ఆయన మంత్రికూడా అయ్యారని తెలుస్తోంది. ఆయన ఇటీవలే పెళ్లి చేసుకున్నారు – ఆయన భార్య రుమానియా చిన్న పిల్లల "రాజకీయ – విద్యా సంస్థ"కి నాయకురాలుట. భారత దేశంలో గాంధీగారు, సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్ మొదలయినవారి సంతానం గురించి ఎవరు వింటున్నారు? పండిత నెహ్రూ సంగతే వేరు. కాని రుమానియాలో, ఉత్తర కొరియాలో శ్రీమతి గాంధీకి పాఠాలు నేర్పగలిగినవారు ఉన్నారన్నమాట...



దొంగతనం చేసి సంపాదించిన డబ్బుతో ఒక ఫాక్టరీని స్థాపించి సంఘంలో పెద్ద మనిషిగా చెలామణి అవుతున్న సుదేష్ వర్మ (28)ని ఈమధ్య ఢిల్లీలో పోలీసులు అరెస్టుచేశారు. దొంగ సొమ్ముతో ఒక స్థలం కొని దానిలో 80 వేల రూపాయలు పెట్టి ఒక శివ మందిరాన్ని నిర్మిస్తున్నట్లు ఇతను పోలీసులకి చెప్పాడు. ఇతను ఒంటరిగానే దొంగతనాలు చేస్తాడుట. 5 లక్షల రూపాయలు దొంగతనాలద్వారా సంపాదించిన ఇతనిపై 60కి పైగా కేసులు ఉన్నాయిట...

# వారఫలం

11-5-1984 శుక్రవారం మొదలు 17-5-1984 గురువారం వరకు

♈ మేషం: జనరంజకంగా మెలగుతారు. పనిపాటలు చేసే వారికి మేలు చేయాలని యత్నిస్తారు. ఆలస్యంగానయినా నూతన వ్యాపారం ప్రారంభించే యత్నాలు కొనసాగిస్తారు. అనుకోకుండా ధనం అందుతుంది. స్థిరాస్తి సంపాదించే యత్నాలుంటాయి. స్త్రీలకు: వృత్తి పెంపు, గృహానందం, ఆరోగ్యమందు అభివృద్ధి కనిపిస్తుంది.

♉ వృషభం: గత కొన్ని వారాలలో జరుగని పనులకు, వ్యవహారాలకు ప్రగతి కనిపిస్తుంది. పెండ్లికి ఎదిగిన వారి శుభ ప్రస్తావనల నిమిత్తం ప్రయాణించనున్నారు. వృత్తియందు పెంపు కనిపిస్తుంది. ఆరోగ్యం బాగుపడుతుంది. పరిచితులు మీ సహాయం కోరి యింటికి రానున్నారు. సొంతపనులు చక్కబెట్టుకొంటూ వారికి సాయం చేయటం న్యాయం. స్త్రీలకు: కళారంగానుకూల్యత, తద్వారా ధనాదాయమున్నది గ్రహించండి.

♊ మిథునం: వారం మొదట్లోనే 'లాభదాయకంగా, ఆనంద దాయకంగా గడచిపోతుంది వార' మని గ్రహింపగలుగుతారు. వ్యాపార రీత్యా ప్రయాణించవలసిన అగత్యం కొందరి విషయంలో చెప్పదగిన అంశం. స్థిరాస్తి అభివృద్ధి నందించే మీ యత్నాలు సఫలం కాగలవు. స్త్రీలకు: కుటుంబ వ్యవహారాలతో, నూతన వస్తు సేకరణతో కాలం గడచిపోతుంది.

♋ కర్కాటకం: ఇటీవల ఎన్నడు జరుగని లాభదాయకమయిన వ్యవహారం ఏదో తటస్థపడనున్నది. వృత్తిలో పెంపు కనిపిస్తుంది. 'జాయింటు' వ్యాపారమయితే, భాగస్వాములతో మాట పట్టింపులుంటాయి. ఒకానొక వివాద గ్రస్త విషయం వలన చికాకు కనిపిస్తుంది. స్త్రీలకు: కొందరకు దూర ప్రాంతాలకు పయనం, రచనా విధాన మేలు చెప్పదగియున్నది.

♌ సింహం: అలవాటుగా మీరు గావించే వ్యాపారంలో ఏదో లోటు కనిపిస్తుంది. తీర్థయాత్రా చరణం కొందర విషయంలో చెప్పవచ్చు. వ్యాపారనిమిత్తమే ప్రయాణించనున్నారు. స్త్రీలకు: బంధు విరోధం రాకుండా చూచుకోవటం చెప్పదగిన అంశం, గ్రహించాలి. ఉద్యోగస్థులయితే పెంపు ఉన్నది.

♍ కన్య: క్రమ క్రమంగా మేలు, ఆదాయం, అభివృద్ధి, వృత్తిలో పెంపు కనిపించటం గ్రహించియే ఉంటారు. అనుకూల సమయంగాన బాగా శ్రమించటం అవసరమే. అప్పులు వసూలు చేయటానికి యత్నించదగిన వారం. స్త్రీలకు: బంధువులయింటికి ప్రయాణం చేయదగిన అగత్యం ఏర్పడుతుంది. అధిక వ్యయం కూడ చెప్పదగిన అంశం. గ్రహించండి.

♎ తుల: మీకు మంచి గ్రహస్థితిగల వారం. రాశియందు స్థితుడైన 'ఉచ్ఛశని' రాజకీయంగా మేలు చేయనున్నాడు. వ్యవహార రీత్యా మేలు జరుగనున్నది. ఏమయినా తొందరపాటు ఏ వ్యవహారంలోనైనా తగదని గ్రహించాలి. స్త్రీలకు: సగంలో నిలచిన పనులు పూర్తియగుటకు, ఆశించిన ద్రవ్యం అందుటకు అనుకూల వారం.

♏ వృశ్చికం: ప్రజ్ఞాబలం గొప్పది. అందు మూలాన కొన్ని వ్యవహారాలలో విజయం సాధిస్తారు. నాలుగు విధాలా అనుకూలత కనిపిస్తుంది. స్వల్పంగా ఆదాయం కూడా కనిపించక తప్పదు. లాభదాయక వ్యవహారాలలో మేలు చేకూరుతుంది. కుటుంబానందం, సుఖ సంతోషాలు చెప్పదగిన ముఖ్యాంశాలు స్త్రీలకు: చుట్టు ప్రక్కల తగాదాలతో, అనవసర ప్రస్తావనలతో వారం దాటిపోతుంది.

♐ ధనుస్సు: 'గ్రహణం వదలిన గ్రహం లాగు' కొన్ని యిబ్బందుల నుండి విముక్తి పొంద గలిగినామని సంతోషిస్తారు. పెద్దల మూలంగా కార్యానుకూలత కనిపిస్తుంది. కార్యసాధనకు కావలసిన బలం, ముందు చూపు, కలదని సంతోషిస్తారు. మనశ్శాంతి లభిస్తుంది. స్త్రీలకు: వృత్తియందు పెంపు, ఉద్యోగమందు అభివృద్ధి చేకూరుతుంది.

♑ మకరం: మీకు గల ప్రజ్ఞాబలం ఐశ్వర్య ప్రదాయకం. ఆలోచించి వృత్తిలో గాని, వ్యాపార రీత్యా గాని నూతనమార్గాన్వేషణ గావింపనున్నారు. బంధువర్గీయులతో గాని, హితులతో గాని మాటపట్టింపులు రాగల అవకాశాలున్నాయి. కాని వ్యవహారాలందు తల దూర్చకండి. స్త్రీలకు: ధనాదాయం గల వారం

♒ కుంభం: వారంమధ్య భాగంలో మీకు ధనలబ్ధికి అవకాశమున్నది. తల పెట్టిన పనులు కొనసాగించుకొనే తలంపు అధికంగానాటుకొంటుంది. కొందరకు రాజకీయ రంగానుకూలత చెప్పదగిన అంశం. స్త్రీలకు: ఎంత తాపత్రయపడినా లాభించకపోవటం, రావలసిన పైకం అందకపోవటం గమనింపదగిన అంశాలు.

♓ మీనం: వివాదపరిష్కారానికి అనుకూలం. ఆశించిన రాబడి నిస్సందేహంగా చేతికి అందుతుంది. నిరాటంకంగా అవసరాలు తీరుతాయి. రాబడిలో హెచ్చు తగ్గులుంటాయి. వ్యాపారం కూడా కొంత కుంటుపడవచ్చు. ఆరోగ్యంలో కూడా లోపం కనిపించవచ్చు. స్త్రీలకు: పని పాట్ల తొందర, కించిత్తు ఆదాయం, యత్న కార్యసిద్ధి చెప్పదగిన ముఖ్యాంశాలు, గ్రహించాలి.



# ఓరియంట్ ఫ్యాన్స్ అలా నడుస్తూనే ఉన్నాయి

వేసవి వేడిలో కొద్ది కాలాన్ని మిమ్మలను చల్లబెడతాయి కొన్ని వస్తువులు. వాటిలో వున్నాయి కొంత కాలానికి నాణ్యతా ముద్రితమైన ఫ్యానులు.

ఒక ఫ్యాన్ జీవితాంతం పని చెయ్యాలనుకొనే నాంది పలుకుతోంది ఓరియంట్ ఫ్యాన్ అదే ఓరియంట్‌లో మొదటి నిర్ధారణ.

అందుకే జీవితాంతం పని చేసేలా మేం తయారు చేస్తున్నాం మా ఫ్యాన్స్ అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో అతి సున్నితమైన సామగ్రిని వాడి.

మా ఫ్యాన్స్ అన్నీ ఇలానే తయారు చేయబడినాయి. మీరు ఎంచుకొనేందుకు ఎన్నో మోడల్స్‌లో లభిస్తున్నాయి—సీలింగ్, టేబిల్, బ్రాకెట్ మరియు పెడస్టల్. వివిధ షేడ్స్‌లో, షేప్స్‌లో మరియు సైజులలో అత్యంత మేలిమైనవిగా మీకు అందుబడిలోనున్న సరసమైన ధరలకు లభిస్తున్నాయి.

ఎవరి వద్దఅయితే ఓరియంట్ ఫ్యాన్ ఎప్పుడూ ఉందో వారి సలహాను అడగమని మేం మీకు విన్నవించుకుంటున్నాం. వారు మీకు ఏం చెప్తారో తెలుసా. ఓరియంట్ ఎప్పుడూ ఇచ్చిన హామీని నిలుపుకుంటుంది





## ఓరియంట్

జీవితాంతం ఒక మేలిమైన హామీ

CC/OGI-9/84 TEL

# అతని పేరు మనిషి

**కన్నెపల్లి గోపాలకృష్ణ**

ఇంటిలో మనిషి పోయినట్లు ఎడతెరిపి లేకుండా ఏడుస్తోంది ఆకాశం రెండు రోజులుగా.

అటు చినుకులూ కాక, ఇటు వానా కాక ముసురుపట్టి నులికడుపులా చికాకు పెడుతోంది వర్షం.

వరండాలో అసహనంగా పచార్లు చేస్తున్నాడు వరదరాజులు.

"వెధవ వాన" ఏ నూటఒకటోసారో అనుకున్నాడు ఆ గంటలో.

"అప్పుడనగా వెళ్ళిన ఈ నౌకరువెధవ ఇంకా రాడేం?" చికాగ్గా గొణుక్కున్నాడు. ఏంచేయాలో తోచక మళ్ళీ పచార్లు ప్రారంభించాడు.

కర్లీ సిల్కులాల్చీతో, మెడలో సన్నపాటి బంగారు గొలుసుతో అతనలా చేతులు వెనక పెట్టుకొని తిరుగుతుంటే ఏ పెద్దపులో తిరుగుతున్నట్లుంది.

ఆ జిల్లాకి ఒకప్పుడు పెద్దపులే వరదరాజులు.

అతను ఫోన్‌కాల్ కొడితే సరి ఉరుకులు, పరుగులమీద పనులు చేసిపెట్టేవారు అధికారులు.

ఆ వరండా ఇప్పుడంటే బోసిగా ఉందికానీ ఆశ్రితజనాలతో కిటకిటలాడేది మూడేళ్ళ క్రిందటి వరకూ.

ఆ జిల్లాలో ప్రతి ఎమ్మెల్యే నెలకు రెండు సార్లయినా అతని దర్శనార్థం రావలసిందే.

అతను నవ్వితే వంతకలిపేవారు జనాలు.

మాట్లాడితే 'ఓహో' అని తలలూపేవారు.

అతను చెప్పిందే వేదమన్నట్లు ప్రవర్తించేవారు.

అవును మరి! బెల్లం చుట్టూ చీమలు చేరుతాయి. అధికారం ఉన్నవాడి చుట్టూ ఆశ్రిత జనులు చేరుతారు. ఇది లోకసహజం.

ఇరవై ఏళ్ళపాటు ఆ జిల్లాని మకుటం లేని మహారాజులా పరిపాలించాడు వరదరాజులు వివిధ హోదాలతో.

ఎమ్మెల్యేగా, కార్పొరేషన్ ఛైర్మన్‌గా, మంత్రిగా, జిల్లాపరిషత్ అధ్యక్షుడిగా. అతడు ఎత్తని రాజకీయావతారం లేదు. ప్రత్యర్థుల మీద వేయని పాచికా లేదు.

కాస్తలో ముఖ్యమంత్రి అయేవాడు కానీ కొత్తగా వచ్చిన పార్టీ వెల్లువలో కొట్టుకుపోయాడతను, జనం నాడిని తెలుసుకోలేక.

ఇంత రాజకీయ పరిజ్ఞానమూ దెబ్బతింది— ఆ ఒక్క విషయంలో. అలా జరుగుతుందని ముందే ఊహించి ఉంటే ఏనాడో జెండా మార్చేసేవాడతను.

అంచనాలు తారుమారై, తాను చిత్తుగా ఓడిపోయాక ఆశ్రితులతో చాలా మంది దూరమయ్యారు. అతనితో మిగిలినవాళ్ళు ఇప్పటికైనా మించిపోయింది లేదు పార్టీ మారిపొమ్మని బలవంతపెట్టినా అతను వినలేదు.

ఓడినవాడు ఏ పార్టీలో ఉన్నా ఒకటేనన్నది వరదరాజుల ఫిలాసఫీ. అదే తను గెలిచి ఉంటే ఏ మంత్రి పదవికో బేరమాడేసి గోడ దూకేసేవాడు. ఇప్పుడు తను అటు గెంతుదామన్నా వాళ్ళేం సంబరపడిపోరు. దాని బదులు పాత పార్టీలో ఉంటేనే నయం. ఏ రోజైనా తిరిగి అది అధికారంలోకి రాక మానదు. పార్టీ విధేయుడిగా తనకు తగిన ప్రతిఫలం లభించక తప్పదు.

ఇది వరదరాజుల ప్రగాఢ విశ్వాసం.

అందుకనే అతను తొందరపడలేదు.

కొత్తపార్టీలోకి వలసపోయిన వాళ్ళు పోగా మిగిలినవాళ్ళతో పార్టీపునర్నిర్మించేకార్యక్రమంలో బిజీగా ఉన్నాడతను.

అతని శ్రమనుంచుకోక తగిన నిధులే ముట్టచెప్తోంది పార్టీ.

ఇంకా చెప్పాలంటే రెండు భగవద్గీతల చరిత్ర ఉంది అతని వెనుక.

ఇక వర్తమానంలోకి వస్తే—

కొన్ని పార్టీ విషయాలు అత్యంత అర్జెంటుగా మాట్లాడాలని, ఇమ్మీడియేటుగా రమ్మని లైట్నింగ్ కాల్ బుక్‌చేసి మరీ చెప్పాడు భావనపాడు మాజీ ఎమ్మెల్యే. తనకున్న సహచరులలో అత్యంత విశ్వాసపాత్రుడతను.

అంత ముఖ్యమైన విషయం కాకపోతే అతనంతగా కంగారు పడడు. బహుశా తమ ఫ్యూచర్ ప్లానులకు సంబంధించినది అయి ఉండవచ్చు.

ముప్ఫై కిలోమీటర్ల దూరమిక్కడికి భావనపాడు.

కారులో వెళ్తే అరగంట ప్రయాణం.

ఉన్న అంబాసిడర్ సమయానికి పనికి రాకుండా పోయింది.

బండి సరిగ్గా లాగడం లేదని రెండురోజుల క్రితమే రిపేరుకు పంపాడతను.

స్కూటరుపై వెళ్దామంటే పసిపాప ఏడుపులా ముసురు.

నౌకరు గేటు తెరుచుకు రావడంతో ఆత్రంగా చూశాడు వరదరాజులు.

"ఏమన్నాడ్రా డాక్టరు" నౌకరు ముఖం చూడగానే సగమర్థమయ్యిందతనికి.

గొడుగు మడుస్తూ ఆ మిగిలిన సగం పూర్తి చేశాడతను.

"అవును బాబయ్యా! ఆరి ఫామిలీ పిచ్చర్‌కెల్తారట కారులో. అందుకని ఈలు కాదన్నారయ్యా డాట్టరు బాబు."

"హుఁ" అంటించని చుట్టను నేలకేసి కొట్టాడు వరదరాజులు.

"అంత పొగరెక్కిందన్నమాట ఆ డాక్టర్‌కి. ఈ రోజు ఈ గడ్డపై నిలబడగలిగాడంటే వరదరాజుల చలవేనని మరచిపోయాడన్నమాట. అర్జెంటుగా కారు కావాలని కబురంపితే అంత నిర్మొహమాటంగా కాదంటాడా? కృతఘ్నుడు. వీడి రోగం కుదిర్చే రోజు రాకమానదు" కసిగా అనుకున్నాడతను.

కిం కర్తవ్యమ్?

అర్జెంటుగా వెళ్ళాల్సిన విషయం.

ఇక ఆర్టీసీ బస్సే శరణ్యం.

బస్‌స్టాండు మూడున్నర కిలోమీటర్ల దూరం. బస్‌స్టాండుకి పోవాలంటే రిక్షా తప్ప మరో మార్గం లేదు.

"రిక్షా పిలుచుకురా, పో" పురమాయించాడు.

మళ్ళీ గొడుగు తెరిచి వెళ్ళాడు నౌకరు.

అయినా బస్‌స్టాండులూ, రైల్వేస్టేషన్లూ ఊరికి దూరంగా ఎందుకు కడుతుందో ప్రభుత్వం?

అసలు ఊరి మధ్యలో కట్టాల్సిన కాంప్లెక్సే అది.

ఆ కాంప్లెక్స్ కట్టడానికి ఇంజనీరు ఎంచిన భూమి బావమరిదిది. అందుచేత తాను పైఎత్తేసి ఊరికి దూరంగా ఉన్న తన పోరంబోకు భూమిని దానంగా ఇచ్చేసాడు ప్రభుత్వానికి బస్‌స్టాండు కట్టుకోమని.

ఆ సమయంలో ప్రజలూ, పత్రికలూ తనని దానకర్ణుడికి పొగిడిన తీరు గుర్తుకొచ్చి నవ్వు మొలుచుకొచ్చింది అతని పెదవులపై.

"రిక్షా తెచ్చాను బాబూ" వినయంగా చెప్పాడు నౌకరు.

చిరిగిన బట్టలూ, నీళ్ళు కారుతున్న తలా,

బక్కచిక్కిన శరీరమూ ఈ దేశపు దరిద్రుడి ప్రతినిధిలా ఉన్నాడు రిక్షావాడు.

వయసు పాతిక నుంచి ముప్పై దాకా ఉండొచ్చు.

కనీసం తలపైన కప్పుకోడానికి గుడ్డముక్క కూడా లేదేమో చిక్కాగా తడిసిపోయి ఉన్నాడతను.

అతన్ని చూడగానే వరదరాజులకెందుకో జాలేసింది.

ఇంత వానలో తొక్కగలడా వీడు అనుకున్నాడు.

"ఏరా, అలా ఊరికే వానలో తడిసేబదులు ప్లాస్టిక్ కాగితమైనా కప్పుకోరాదూ" మందలించాడు. ఓ విచిత్రమైన నవ్వు నవ్వాడు రిక్షావాడు.

తరచి చూస్తే ఆ నవ్వులో ఎన్నో అర్థాలు కనిపిస్తాయి. అంత ఓపికలేని వరదరాజులుకి అనిపించిందొక్కటే — వాడందుకు కూడా నోచుకోలేదని.

అతనికి తన పాత రెయిన్ కోటు గుర్తొచ్చింది.

అక్కడక్కడా చిల్లులు పడ్డా గట్టిగానే ఉందది.

వీడికి దానం చేస్తేసరి— సంతోషిస్తాడు.

"అరేయ్ సింహాచలం. అమ్మగార్నడిగి నా పాత రెయిన్‌కోటు పట్టుకురా పో" చెప్పాడు నౌకరుకి.

రెండు నిముషాల్లో తిరిగొచ్చాడు నౌకరు రంగువెలసిన పాతపచ్చటి రెయిన్‌కోటుతో. గత కాలపు వైభవాల చిహ్నంలా ఉందది.

"ఇంద. ఇది తొడుక్కో" చెప్పారు వరదరాజులు రిక్షావాడితో.

"వద్దులే బాబుగారూ" కదలకుండా చెప్పాడు రిక్షావాడు.

"ఊరికే ఇస్తుంటే టెక్కు చూపిస్తావేంరా! వానలో చూడు ఎలా ముద్దైపోయావో. వర్షానికి బాగా కాస్తుందిది. తొడుక్కొని చూడు" కసురుతున్నట్లు చెప్పి, రెయిన్‌కోటు అందించాడు వరదరాజులు.

ఏమనుకున్నాడో ఏమో మారుమాట్లాడకుండా తీసుకున్నాడు రిక్షావాడు.

ఆ సమయంలో ఫొటోగ్రాఫరు లేనందుకు కాస్త బాధపడ్డాడు వరదరాజులు.

"రేపటికల్లా వచ్చేస్తాను. ఇంటి కెవరొచ్చినా వైజాగెళ్ళానని చెప్పు. రాత్రి తలుపులన్నీ జాగ్రత్తగా వెయ్యి" పనివాడితో చెప్పాడు వరదరాజులు రిక్షా ఎక్కుతూ.

మన్నుతిన్న పాములా మెల్లగా కదిలింది రిక్షా.

లంక పుగాకు చుట్టను వెలిగించి, గట్టిగా దమ్ము పీల్చాడు వరదరాజులు గుండెలనిండా!

వేడి గుండెల్లోంచి ఒళ్ళంతా జలజలా పాకినట్లయి, కళ్ళు మూసుకున్నాడు తన్మయత్వంతో.

మళ్ళీ మరో పీల్పు పీల్చాడు. రిక్షా మెల్లగా పోతున్నట్లనిపించింది.

రిక్షా అతను రిక్షా తొక్కడానికి బదులు క్రిందకుదిగి నడిపిస్తున్నాడు.

అతని నీరసపు ముఖమూ, పట్టుతప్పుతున్న చేతులూ, ఇందాక తనుచూసిన లోతు కడుపూ అతను తిండితినలేదని చెప్పకనే చెప్తున్నాయి.

వీడి లెక్కన నడిపిస్తే బస్‌స్టాండు పోవడానికి గంటపైగానే పడుతుంది. ఇంతలో బస్సు వదిలేసినా వదిలెయ్యొచ్చు.

వీడ్ని హుషారు పరచాలంటే వీడి ఆకలి తీర్చడంతప్ప మరో మార్గంలేదు.

రిక్షావాడు తల ఎత్తాడు. కంటినిండ కన్నీరు.

"అలా బాధపడకురా పిచ్చిసన్నాసీ. ఏడిస్తే కడుపు నిండుద్దా. చూడు తిండిలేక ఎలా డీలపడ్డావో? తిండి కలిగితే కండ కలదోయ్, కండ కలవాడే మనిషోయ్ అన్నాడు మహానుభావుడు. ఇంద ఈ రెండ్రూపాయలూ పట్టికెళ్ళి ఆ కనబడే హోటల్లో కాస్త తినిరా" నోటు అందిస్తూ చెప్పాడతను.

"వద్దు బాబూ, తర్వాత తింటా" నేల చూపులు చూస్తూ చెప్పాడు రిక్షావాడు. "ఒర్నీ, నీ బెట్టు దొంగల్తోలా! నువ్వేమీ తినకపోతే



"ఏరా అబ్బీ, భోంచేసావా ఈ రోజు?" గొంతులో కరుణరసం మేళవించి అడిగాడు వరదరాజులు.

రిక్షావాడు సమాధానం చెప్పకుండా తల వంచుకొని రిక్షా నడుపుతున్నాడు. "ఆపు" అన్నాడు వరదరాజులు.

రిక్షా ఆగింది.

"ఏరా, భోంచేసి రెండు రోజులయ్యింది కదూ నువ్వు. వెర్రినాగన్నా, సిగ్గుపడుతున్నావా?" లాలనగా అడిగాడు వరదరాజులు.

పాపం నాకు చుట్టుకుంటుందోయ్. చూడు ఎంత నీరసంగా ఉన్నావో? మరేం మాట్లాడక కొంచెం తినిరా" అతని చేతిలో బలవంతంగా నోటు పెడుతూ చెప్పాడు వరదరాజులు.

అతని వంక కృతజ్ఞతగా చూసి, రిక్షాని పక్కకులాగి, తెరలు సర్ది, గబగబ ఎదురుగా నున్న పాక హోటల్లోకి జొరబడ్డాడు రిక్షావాడు.

చుట్టని పీలుస్తూ, ఆలోచనలో పడ్డాడు వరదరాజులు.

# అతని పేరు మనిషి

"బాబుగారూ, టీ..." రిక్షావాడి మాటలకి కళ్లు తెరిచాడతను.

ఎదురుగా గాజుగ్లాసుతో పొగలు కక్కుతున్న టీతో రిక్షాఅతను.

"నాకెందుకులే. నువ్వు తీసుకో" అన్నాడు వరదరాజులు.

"నే తాగేవచ్చాను బాబూ. ఈ చల్లటి వర్షంలో కాస్త వేడిగా ఇది పడితే బాగుంటుంది. తీసుకోండి బాబుగారూ" చెప్పాడు రిక్షావాడు.

అతను చెప్పినట్లు వేడివేడిగా టీ తాగితే బాగానే ఉంటుందనిపించింది వరదరాజులుకి కూడా! బెట్టు చేయకుండా గ్లాసు అందుకున్నాడు.

ఖాళీగ్లాసుని హోటల్లో ఇచ్చేసి, సీటు మీద కూర్చొని, పెడల్ పై కాలేసాడు రిక్షా ఆసామి.

కడుపు కాస్త నిండిందేమో, కాలుకి హుషారొచ్చింది.

ఎదురుగాలిని కూడా లెక్కచేయకుండా స్పీడుగా పోతోంది రిక్షా.

భావనపాడు మాజీ ఎమ్మెల్యే ఎందుకు ఫోన్ చేశాడా అని ఊహలో పడ్డాడు వరదరాజులు.

ఎదుటిపక్షం ఎమ్మెల్యే ఎవరైనా తమపక్క ఒరుగుతానన్నాడా ?

లేక తనపక్షం వాళ్ళు ఎవరైనా అటువైపు దూకనున్నారా ?

అదీకాక రాబోయే ఎలక్షన్ల రాజకీయ ప్రచారానికి ఇంకేదైనా కొత్త ఎత్తులు వేశాడా మాజీ?

రిక్షా కుదుపుకు ఆలోచననుంచి బయటపడి పక్కతెర కొద్దిగా తొలగించి చూశాడు వరదరాజులు.

ఊరు సందడి దూరమైందన్నట్లు పచ్చటి పొలాలు చెపుతున్నాయి.

అక్కడక్కడ విసిరేసినట్లు ఇళ్ళు.

ఎడతెరిపిలేకుండా కురుస్తోందేమో వాన జనసంచారం లేదు రోడ్డుపై.

ఇటీవల వెల్లటూరులో నవరంగ్ చిత్ర కళా నికేతన్ వారు నిర్వహించిన 14వ అఖిల భారత చిత్రకళాపోటీలకి న్యాయ నిర్ణేతగా విచ్చేసిన ప్రముఖ చిత్రకారులు శ్రీ కంచెర్ల బ్రహ్మయ్యగారిని సన్మానిస్తున్న శ్రీ పి. నాగేశ్వరరావు, ప్రక్కన శ్రీ వెల్లటూరి పూర్ణానంద శర్మగార్లని చిత్రంలో చూడవచ్చు



దేశం ప్రగతిపథంలో పయనిస్తున్నట్లు గతుకులబాటలో పరిగెడుతోంది రిక్షా.

రిక్షావాడివంక చూశాడు వరదరాజులు.

అతను తొడుక్కున్న రెయిన్ కోటు పైనుంచి ధారగా కారుతున్నాయి నీళ్ళు.

వయసులో ఉన్న పడుచుపిల్ల చిలిపితనంలా రివ్వున లోనికి దూసుకొచ్చింది చల్లటిగాలి.

గజగజ వణికిపోయాడు వరదరాజులు.

రిక్షాతెరను గబుక్కున వేసేసి, లైటర్ తో లంకపొగాకు చుట్టను ముట్టించి, గుండెలనిండా దమ్ములాగాడు.

నరాలు ఒక్కసారిగా చైతన్యాన్ని నింపుకొన్నట్లయ్యింది.

అలా ధారగా కురుస్తున్న వానలో, శరీరాన్ని గిలిగింతలు పెడుతున్న చలిలో వేడివేడిగా కోడి మాంసం తింటుంటే ! !

అతని ఆలోచనలంతటితో ఆగిపోలేదు.

కోడిమాంసంతోపాటు నోరు తడుపుకొనేటందుకు ఓ విదేశీ విస్కీ సీసా, ఆపైన నంజుకునేందుకు ఓ మదవతీ ఉంటే...

హాయ్ ! ! !

అతని నరాలు మత్తుగా మూలిగాయి.

ప్రపంచంలో అంతకంటె ఏం కావాలి మగాడికి.

ఈ పదవులూ, రాజకీయాలూ, ఎత్తులూ, నటనలూ అన్నీ చిత్తు కాదూ వాటిముందు.

బహుశా ఏర్పాటు చేసే ఉంటాడు భావనపాడు మాజీ.

తన అలవాట్లు, తన మనసు తెలిసిన సహచరుడతను.

ఎంత వేగం అక్కడ వాల్తానా అనిపించింది వరదరాజులికి.

జరగబోయే సమావేశంపై లేదతని మనసు.

మరోసారి తెర తొలగించి చూశాడు.

కిలోమీటరు పైగానే పోయింది రిక్షా.

ఎదురుగాలిలో కూడా అంతవేగం తొక్కగలుగుతున్నందుకు రిక్షావాడిని అభినందించకుండా ఉండలేకపోయాడు వరదరాజులు. వీడి శ్రమ నుంచుకోకుండా ఓ పదిరూపాయలు పడేస్తే సరి. మరీ గుమ్మైపోతాడు.

ఎదుటి మనిషి తత్వాన్ని బట్టి నడుచుకొంటే ఎంతటివాడైనా చిత్తైపోతాడనడానికి వీడే ఉదాహరణ.

గుబురుమీసాల చాటున గుంభనగా నవ్వుకొన్నాడు వరదరాజులు.

ఈ లెక్కన ఇలా పోతే మరో పాతిక నిముషాలలో బస్స్టాండులో ఉంటాడు తను. అంతవరకూ వీడి స్పిరిటు తగ్గకుండా చూడాలి తను.

"ఒరే అబ్బీ" పిలిచాడు వరదరాజులు.

"ఆయ్"

"ఇలా వానలో తడుస్తూ వెళ్తుంటే ఏమనిపిస్తోందిరా నీకు ?"

అవతల నుంచి సమాధానం రాలేదు.

"ఓర్నీ, సిగ్గుపడుతున్నావా ? సరే, పోనీ నే చెప్పనా... ఓ పిటపిటలాడే ఆడది పక్కనుంటే బాగుండుననిపించడంలా ?" అవతల నుంచి రెస్పాన్స్ వస్తుందేమోనని ఆగాడు వరదరాజులు.

రిక్షావాడు ఏం మాట్లాడక తొక్కుకుపోతున్నాడు.

రిక్షా స్పీడు పెరిగిందనిపించింది వరదరాజులికి.

కేవలం ఆడదాని ఊసెత్తేసరికే వీడింత స్పీడుగా లాగిస్తున్నాడే! ఇక రతిక్రీడల విలాసాల కథలు వింటే ఇంకెలా అవుతాడో ?

సరదాగా నవ్వుకొన్నాడు వరదరాజులు.

మనుషుల మనస్తత్వాలను పరిశీలించటం అతనికి అలవాటు.

చల్లటి గాలి, పుంజుకుంటున్న వర్షం, రగులుతున్న చుట్టా అతనిలో చిలిపి ఊహలను రేకెత్తించాయి.

తన శృంగార అనుభవాల గ్రంధంలోంచి ఓ పుటను వీడికి వినిపిస్తే ?

సరదాగా ఉంటుంది. టైమూ పాసవుతుంది. తన రసికత్వానికి అబ్బుర పడిపోయి నివాళు లర్పించడూ వీడు.

"ఎంతమంది పిల్లలా నీకు ?" చుట్టను పీలుస్తూ అడిగాడు.

"అయ్యా. పెళ్ళే కాలేదండి నాకు."

అబ్బుర పడ్డాడు వరదరాజులు.

గోచీగుడ్డ లేకపోయినా మగాడైతే చాలు ఈ దేశంలో— అదే పెద్ద అర్హత కదా పెళ్ళి చేసుకోడానికి.

సరే, బ్రహ్మచారి నంటున్నాడు వీడు. కథ మరీ రంజుగా పడుతుంది. తాను చెప్పే అనుభవానికి డంగైపోయి పెళ్ళని పరిగెట్టడూ కుర్ర నాయాల.

"సరదాగా ఓ కథ చెప్పనా నీకు !" కొత్త చుట్ట వెలిగిస్తూ అడిగాడు వరదరాజులు.

"అయ్యా."

అదే అంగీకారంగా భావించి గొంతు సర్దుకున్నాడు వరదరాజులు.

"ఈ రోజంటే ఇలా నీ రిక్షాలో రావలసిన ఖర్మ పట్టింది గానీ, కారు దిగేవాణ్ని కాదులే నేను. అందులోనూ ఓ దిక్కుమాలిన కార్పొరేషన్ కి ఛైర్మన్ గా ఉన్నప్పుడు యమ రాజభోగం అనుభవించాను. ఇప్పుడు నేను చెపుతున్నది ఈనాటి మాటా ? అబ్బో, ఓ పన్నెండేళ్ళ క్రిందటి సంగతిలే !" ఉపోద్ఘాతంగా ఆగాడు వరదరాజులు.

నెమ్మదిగా పోతోంది రిక్షా.

వానజల్లు ఇంకా ఎక్కువయ్యింది.







''అరే, నువ్వలా స్లో చేస్తే ఎలాగరా అబ్బాయ్? స్పీడు, స్పీడుండాల మనిషన్నాక. నే కథలోకే వస్తున్నా కానీ, నువ్వు వేగం పెంచు.''

స్పీడు పెంచాడు రిక్షావాడు.

కథ ఎలా ప్రారంభించనా అని ఆలోచనలో పడ్డాడు వరదరాజులు. అప్పుడెప్పుడో జరిగిన సంఘటన తలుచుకొంటుంటే ఈనాటికీ ఒళ్ళు వశం తప్పుతోందతనికి.

చుట్ట గట్టిగా పీల్చి, ప్రారంభించాడతను.

''సత్తునానిపాలెం తెలుసా నీకు? ఇక్కడికో పదిమైళ్ళ దూరంలే. అక్కడో హైస్కూలు. ఆ స్కూలు యానివర్సరీకి నన్నో ఏడాది పిలిస్తే వెళ్ళాను. ఏవో నాలుగు సొల్లు కబుర్లు చెప్పిం తర్వాత ఆటల్లో, పాటల్లో గెలిచిన పిల్లలకు బహుమతులివ్వడం ప్రారంభమయ్యింది. ఆ టైములో వాళ్ళకెలా ప్రైజులిచ్చానో నాకు తెలియదు. నా కళ్ళూ, ఒళ్ళూ నా స్వాధీనంలో లేవనుకో. కారణమేమిటో తెల్సా...'' పెద్దగా నవ్వాడు వరదరాజులు.

''నువ్వు చెప్పకోలేవులే! నేనే చెప్పేస్తున్నా...'' ఊరిస్తున్నట్లు ఓ క్షణం ఆగాడు.

''ఓ అందాల పంతులమ్మ...

అందమంటే అలాటిలాటి అందం కాదనుకో. రంభని కూడా వెక్కిరించే అందం. ఆ పిల్ల ఎలా ఉందంటే కొవ్వెక్కిన పావురంలా, నోరూరిస్తున్న జున్నుముక్కలా, కడ్డకట్టిన పెరుగులా, ఇంకా చెప్పాలంటే బిళ్ళకుడుములా ఉందనుకో. అందులోనూ తెల్లటి జరీచీర, మల్లెపూలతోనూ వచ్చి నా పక్కనే నిలబడి ప్రైజులందిస్తోందేమో వెర్రెక్కిపోయిందనుకో నాకు'' ఆ అమ్మాయి ఎదురుగా నిలబడిందా అన్నంత టెన్షనొచ్చింది అతగాడికి.

కసిగా చుట్ట దమ్ములాగాడు సగం కాలిపోయేలా.

రిక్షావాడు స్పీడుగానే పోతున్నాడనిపించిం దతనికి.

''ప్రైజులిస్తున్నప్పుడూ, సర్టిఫికేట్లిస్తున్నప్పుడూ చేతులు తగిలేవి. దాంతో నరాలు జివ్వుమనేవి. ఆ పంతులమ్మని స్టేజిమీదే పట్టేసుకుందామా అన్నంత ఇదయ్యింది నాకు.'' కంటిన్యూ చేస్తూ చెప్పుకుపోతున్నాడతను.

''ఆ పిల్లమీద మనసయ్యింది నాకు. అటువంటిదాన్ని పొందలేని జన్మ దండగే అనిపించింది. ఫంక్షనంతా అయిపోయాక మెల్లగా సమితి ప్రెసిడెంటుతో కదిపాను విషయం. తేలు కుట్టినట్లయ్యాడు వాడు. దానిగురించి తానూ ఎన్నో ప్రయత్నాలు చేసానని, ఎవరికీ లొంగే ఘటం కాదని, మహా స్ట్రిక్టనీ, అదనీ, ఇదనీ చెప్పాడు. మోజు మరీ పెరిగింది నాలో. అలాంటిదాన్ని పక్కన చేర్చుకొనే జన్మే జన్మను కొన్నాను. మరి దానికెలా తెలియపరచడం? వాళ్ళచేతా, వీళ్ళచేతా చెప్పిస్తే ఏం లాభం? నేనే డైరెక్టుగా అడిగేద్దామనుకున్నాను. నా అంత పెద్దోడు అడిగితే ఒప్పుకోకుండా ఉంటుందా అనుకున్నా. హెడ్మాష్టరు రూములో ఒంటరిగా కూర్చొని దాన్ని పిలిపించాను.''

ఓ లారీకి సైడిచ్చి, మలుపు తిప్పాడు రిక్షావాడు. సగం దూరం పైగానే వచ్చింది రిక్షా.

''ఫంక్షన్ గొప్పగా ఆర్గనైజ్ చేశావు పిల్లా'' మెచ్చుకోలుగా అన్నాను.

సిగ్గుపడుతూ నవ్వింది.

''నీలాటివాళ్ళు ఇలా పల్లెంలో పడి ఉంటే ఏం లాభం? పట్నం బదిలీ చేయించమంటావా'' అని అడిగాను చనువుగా.

పట్నం హాస్టల్లో తమ్ముడుండి చదువుకొంటున్నాడని, అక్కడికి బదిలీ చేయిస్తే ఋణపడి ఉంటానంది ఆమె.

ఎంతో ఋణపడి ఉండనక్కరలేదని, ఆ ఒక్క రాత్రికి బూత్ బంగళాకొస్తే చాలునని చెప్పేను చెయ్యి పట్టుకొంటూ.

నా చెంప ఛెడేలుమంది. ఒక ఆడది కానీ, మగాడు కానీ నన్నలా కొట్టడం అదే మొదటిసారి, చివరిసారి అనుకో.

కళ్ళల్లో నిప్పులుచిమ్ముతూ వెళ్ళిపోయిందది.

అంతవరకూ కోరికే ఉండేది నాలో. కానీ ఆ అవమానంతో కసి కూడా పెరిగింది నాలో.

ఆఫ్టాల్ ఒక టీచరమ్మ నన్ను కొట్టడమా?

దాని అంతు ఎలాగైనా చూడాలనుకొన్నాను.

పొగరుమోతు గుర్రాన్ని లొంగదీసుకోడమే మగతనమంటే, అలాటి మొండిదాన్ని అనుభవిస్తేనే ఆనందం.

హెడ్మాష్టర్ని పిలిచి, దాని పేరు కనుక్కొన్నాను.

అమృతవల్లనో, అచ్యుతవల్లనో చెప్పాడతను...

రిక్షా స్లో అయ్యింది.

''ఇదంతా ఎనేళ్ళ క్రిందటన్నారూ?'' రిక్షావాడు అడిగాడు. అతని గొంతులో ఏదో మార్పు.

రిక్షావాడు వేడెక్కిపోయాడని సంబరపడిపోయాడు వరదరాజులు.

''పానకంలో పుడకలాగ ఏవిటయ్యా ఈ చొప్పదంటు ప్రశ్న? పన్నెండేళ్ళ క్రిందట. సరిగ్గా పన్నెండేళ్ళ క్రిందటని ఎలా గుర్తుందంటే ఆ తర్వాత నెలలో నేను మంత్రినయ్యాను కాబట్టి.''

అంతవరకు నిశ్శబ్దంగా వున్న ఆకాశం ఫెళ ఫెళా గర్జించింది.

ఎక్కడో పిడుగు పడింది.

వరదరాజులదురుకొని, గుండెలపై ఊసుకున్నాడు.

''సరే, తర్వాతేమయిందనుకొన్నావ్? నేనూరుకొంటానా? జమా జెట్టీల్లాటి నలుగురు మనుషుల్ని పంపి, దాన్ని బంగళాకి ఈడ్పించు




# పశ్చిమ దేశాల వారిని నిందించడ మెందుకు?

బాగా బలసిన తిండిపోతులుగా పశ్చిమ దేశాల వారిని చిత్రించే ఒక కార్టూన్‌ను చాలా కాలం కిందట భారతీయ పత్రికలలో ఒక దానిలో చూచాను. వారిలో చాలా మందికి చాలినంత తిండి లభించదని మీకు తెలియక పోవచ్చుగానీ నాకు తెలుసు. ఈ కార్టూన్ అతిశయోక్తి మాత్రమే కాదు. ప్రజలు ఆకలితో బాధపడుతూండడానికి ఇతరులెవరో కారణమని నిందించుతుంది. అసలు సమస్య మన అధిక జనాభా. అమెరికా జనాభాకు మూడింతలున్నది మన జనాభా. సాగుకు లాయకీ అయిన మనదేశంలోని భూమి అమెరికాలోని భూమిలో మూడో వంతుంటుంది. అంటే వ్యత్యాసం తొమ్మిది రెట్లు !!! ఇందుకు పశ్చిమ దేశాల వారిని మనం ఎందుకు నిందించాలి?

మన దారిద్ర్యం సమస్యకు పరిష్కారం జనాభాను తగ్గించడమేనన్న గట్టి నమ్మకం అమెరికాలో చాలా సంవత్సరాలు గడపిన తర్వాత నాకు కలిగింది.

మన పూర్వీకులకు ఎనిమిది మంది పది మంది బిడ్డలుండేవారు. దానికి కారణం జనాభాను అదుపులో పెట్టే పరికరాలు వారికి అందుబాటులో లేకపోవడం. ఇప్పటి తరం వారు ఇరువురు లేదా ముగ్గురు బిడ్డలను కలిగి వుంటున్నారు. ఇది మంచిదే. ఒకే ఒక బిడ్డ వుంటే ఇంకా చాలా మంచిది. ఈ పద్ధతి ననుసరించితే వంద సంవత్సరాలలో మనం సుసంపన్నుల మవుతాం. ఇటువంటి కుటుంబాల వల్ల ప్రయోజనాలు చాలా వున్నాయి.

మరొక సంగతి కూడా నాకు తెలుసు. మొదటి బిడ్డ ఆడదయితే మగపిల్లవాడు కావాలని కాన్పులను కొనసాగించుతారు. ఇదొక భ్రమ. వెయ్యి సంవత్సరాల కిందటయితే ఆడపిల్లలను హీనంగా చూస్తే అర్థం వుండేది.

నన్ను అపార్థం చేసుకోకండి. ప్రభుత్వం బలవంతంగా జన్మ నిగ్రహ పద్ధతులను, కుటుంబ నియంత్రణ పద్ధతులనములు పంచాలని నేను సూచించడం లేదు. ప్రజలే ఐచ్ఛికంగా ఈ పద్ధతి ననుసరించాలంటున్నాను. ప్రజాస్వామిక వాదిని నేను. మనసా వాచా భారతదేశమంటే నాకు ఇష్టం. ఎవరికీ అసౌఖ్యం కలగరాదని నా కోరిక. ఐచ్ఛికంగా ఒకే బిడ్డ పద్ధతి ననుసరించితే చాలా బాగుంటుంది. ఈ అంశం గురించి భారతీయుల అభిప్రాయాలను తెలుసుకోవాలనుకుంటున్నాను. 9133, మెసావుడ్స్ ఎవెన్యూ, సాండియాగో, కాలిఫోర్నియా 92126 యు. ఎస్. ఎ. అనే అడ్రెస్‌కు ఏ భాషలోనైనా తమ అభిప్రాయాలు నాకు వ్రాయవచ్చు.

— నరేంద్ర బి. శేథ్ ★

## అతని పేరు మనిషి

కొచ్చాను. అప్పుడు చూడు దాని ఏడుపు. బతిమాలింది. కాళ్ళు పట్టుకొంది. తనకి పెళ్ళి సంబంధం కుదిరిందన్నాది. ఇంకా ఏమేమో చెప్పింది. అది సాకులు చెప్తూ తప్పించుకొంటున్నకొద్దీ నాలో కసి పెరిగింది. దాన్ని చేజిక్కించుకోని...'' కసిగా చుట్టని నలిపాడు వరదరాజులు.

సడన్ బ్రేకుతో రిక్షా ఆగింది.

సైడు తెర తొలగించి లోనికి చూసాడు రిక్షావాడు.

ఎర్రటి కళ్ళూ, పీక్కుపోయిన ముఖమూ, అదరుతున్న పెదవులూ...

వాడ్నిచూస్తుంటే జాలేసింది వరదరాజులకి.

పాపం కడుపు నింపుకోడం కోసం ఈ వానలో ఇంత యాతన వీడికి.

''ఏరా, ఒంట్లో బాగోలేదా ?'' లాలనగా అడిగాడు.

రిక్షావాడు అతని కళ్ళలోకి సూటిగా చూసి, అవునూ కాదన్నట్లు తలూపి, తిరిగి రిక్షా ఎక్కాడు.

మరేం మాట్లాడ బుద్ధికాలేదు, వరదరాజులుకి.

ఓ పదినిముషాల తరువాత బస్‌స్టాండులో ఆగింది రిక్షా.

రిక్షా దిగి, జేబులో చెయ్యిపెట్టి, ఓ పది రూపాయల నోటు బయటికి తీసి, రిక్షావాడికి ఇవ్వబోయాడు వరదరాజులు.

''వద్దు'' చెప్పాడు రిక్షావాడు రిక్షాని వెనక్కు తిప్పుతూ.

''ఏం'' ఆశ్చర్యంగా అడిగాడు వరదరాజులు.

''ఆరోజు నువ్విలా నాశనం చేసిందెవరినో తెలుసా ? ఇంకో నాలుగు నెలలో పెళ్ళి కాబోతున్న నా అక్కని. అవమానం భరించలేక ఉరి పోసుకుంది అక్క. నా అక్కను తినేసిన మృగం కనబడితే చంపేద్దామనే అనుకున్నాను నేను. జనసంచారం ఏమీలేని ప్రదేశంలో నిన్ను చంపడమెంతసేపు ? కానీ అడుగడుగునా మానవత్వాన్ని చూపుతూ నాలో పగకు సంకెళ్ళు వేసావు నువ్వు.

ముక్కూ ముఖం ఎవరో తెలియని వ్యక్తికి రెయిన్‌కోటిచ్చావు. ఒక ఆకలి కడుపుని తడిమావు. యోగక్షేమాలడిగావు. మానవత్వమున్న మనిషిలా ప్రవర్తించావు. ఆదరించిన చేతులను నరకలేక పోయాను నేను. అందుకే నిన్ను చంపడానికి నా చేతులు ముందుకు రాలేదు. బ్రతికిపోయావు. ఇలానే మనిషిలా బ్రతుకు, రెయిన్‌కోటు అతనిపై విసిరేసి, రిక్షా తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు రిక్షావాడు.

నిర్విణ్ణుడై చూస్తూండిపోయాడు వరదరాజులు. ★

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు ముకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు ముకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK5E B82 86 TL

సీరియల్

# తీరాగాని కదే తాళం

చక్కిలం విజయలక్ష్మి

ఉత్తరంలోని విషయం ముగ్గురిలోనే వుండి పోయింది. సుమిత్రమ్మ భర్తతో అంది "పోనీలెండి. వాళ్ళకు జయంతి నచ్చితే జయంతినే ఇద్దాము. ఎటూ జయంతికీ పెళ్ళి చేయాలి కదా ? మనూ 'వద్దన్నాడని బాధ పడ్తున్నామే గానీ ఆ పిల్లకు వేరే వాళ్ళతోనైనా పెళ్ళి చేయాలనే ధ్యాసే మనకు లేకపోయింది."

"ఊహూ. శివానికి మాటిచ్చాను. జయంతి ఈ ఇంటి కోడలు కావలసిందే."

"కాకూడదని ఎవరన్నారు ? కానీ వాడికీ, మనకూ ఆ అదృష్టముండాలిగా? ఈ మణిదీపం మరో ఇంట వెలుగుతుందనుకుంటే బాధగా వుంటుంది" సుమిత్రమ్మ దిగులుగా అంది.

"వద్దు సుమిత్రా. ఈ ఇంటి కోడలై, ఈ సంపద అనుభవించే అర్హత, యోగ్యత జయంతికే వున్నాయి. మరి కొన్నాళ్ళు జరగనీ. జయంతి అర్థమైతే మనూ తప్పక అంగీకరిస్తాడు."

"వాడికి కావలసింది మనస్సూ, మంచితనమూ కాదండీ. కృత్రిమమైన పైపై పటాటోపం" విసుగ్గా అంది సుమిత్రమ్మ.

"వ్యక్తిత్వం ముందు కృత్రిమత్వం ఎంతో కాలం నిలువలేదు సుమిత్రా. జయంతి నీకోడలై నిన్ను లేపి నడిపిస్తుంది చూడు" సుమిత్రమ్మ తల నిమిరారు రఘునాథరావుగారు.

"ఆరోజే వస్తే కాశీకి వెళ్ళి నా కోపాన్ని వదిలి వస్తాను" అంది సుమిత్రమ్మ చిరునవ్వుతో.

**( గత సంచిక తరువాయి )**

"ఇంకా ఎక్కడుంది నీ కోపం ? నీ పెద్ద కోడలితోపాటు అది కూడా నీ నుంచి పారిపోయింది."

## 20

ఈ మధ్య జయంతివి మరో నాలుగు కథలు అచ్చయ్యాయి. ఎంత రహస్యంగా దాచినా ఆ విషయం అందరి చెవుల్లోనూ పడింది. సుమిత్రమ్మ, రఘునాథరావుగార్ల ఆనందానికి అంతులేకుండా పోయింది. గీత పనిగట్టుకుని స్నేహితులకు, తెలిసినవారికి ఫోన్ చేసి మరీ చెప్పింది ప్రతిసారీ.

"జయంతీ, నీతో సేవలు చేయించుకోవటం నాకు సిగ్గుగా వుంది" అన్నాడు హరి ఆరోజు జయంతి కథ అచ్చయిన పత్రికను అపురూపంగా చేతుల్తో తడుముతూ.

"ఏం ? మీ సేవలు చేయడానికి ఒక రచయిత్రికి అర్హత లేదా ?" అంది జయంతి.

"అహ, అది కాదు. ఎంతో విలువైన రచనలు చేయగలిగిన ఆ చేతులు కేవలం ఒక అభాగ్యుడి సేవలో కాలాన్ని వ్యర్థం చేసుకుంటున్నాయే అని."

"అభాగ్యుల సేవలో వుండే పరమార్థాన్ని తెలయజెప్పడానికీ, మానవత్వంలో వుండే మహత్వాన్ని చాటడానికేగా రచనలు ? వాటినే నిర్లక్ష్యం చేశాక, వానినే వ్యర్థం అనుకున్నాక ఇక సాహిత్యపు సత్పరిణామం ఏముంటుంది ? ఛిద్రమైపోయే ఒక సంసారాన్ని నిలబెట్టే బాట చూపే రచన చేయగలిగిన రచయిత ఓ వైపు తన సంసారాన్ని [illegible] చేసుకోవడం ఎంత హాస్యాస్పదమో మీరు చెప్పే మాటా అంతే. మానవ జీవిత చైతన్యానికి రచలుగానీ రచనల కోసం దాన్ని స్థభింప చేయటం కాదు."

"నీవన్నది నిజమే. కానీ, ఇది విను. రాజైనవాడు ప్రజా సేవకుడన్నది సత్యమే. కానీ ప్రజా సేవ అంటూ ఇంటింటికీ వెళ్లి యోగ క్షేమాలు కనుక్కోవడం ఎంత అవివేకం ! అతను చేయవలసిన ప్రజాసేవకు దారి అదికాదు."

నవ్వింది జయంతి.

"మీరన్నదీ నిజమే బావా. కానీ రాజు రాజ్యంలో ప్రజల యోగక్షేమాలు కనుక్కోవడానికి మరెందరో తగినవాళ్ళు వుండవచ్చు. కానీ ఈ ఇంట్లో మా పసి బావను చూడ్డానికి మరెవరూలేరు అలాంటప్పుడు నేనుచేసే రచనల కంటే అతనికి నేను చేసే సేవలే ఎక్కువ ఫలవంతమైనవి" అంది జయంతి.

"అయితే... జయంతీ... నావల్ల...నావల్ల నీ అమూల్యమైన కాలం వ్యర్థమౌతోందా ?" భయంగా అన్నాడు హరి.

"అలా అని అనలేదే ! నా సమయం రచనలో కంటే మీ సేవలోనే ఎక్కువ సద్వినియోగమవుతుందని మాత్రమే అన్నాను."

"ఏమో. ఏమైనా జయంతీ, రేపట్నించీ ప్రతిదానికీ నీవు కల్పించుకోకు. రంగాను పంపు."

నవ్వుతూ మొండిగా అంది జయంతి "పనివాళ్ల మీద మిమ్మల్ని వదలకూడదని నేను ప్రమాణం చేసుకున్నాను."

"జయంతీ !!!"

"అందుకె మీరు త్వరగా పెళ్లి చేసుకోండి" అంటూనే ఆ గది వదిలి వచ్చేసింది జయంతి.

## 21

మాన్‌మోహన్ గాయాలు పూర్తిగా వయమై సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు యధారీతిగా అతని చదువు,ఆటలు.. మామూలే. కానీ అతని మనసులోనే చాలా మార్పులు వచ్చాయి.

ఒక్క సంఘటన మనిషిలో పాదుకుపోయిన బలమైన అభిప్రాయాలను సమూలంగా మార్చి వేయడం అన్నది తన జీవితంలో ప్రాక్టికల్‌గా

**జరిగిన కథ — 6 :** ప్రముఖ ఇండస్ట్రియలిస్ట్ రఘునాథరావుగారు జయంతిని తన ఇంటికి తీసుకొనివచ్చి, భార్య సుమిత్రకు పరిచయం చేస్తారు. ఆమె జయంతిని గుర్తిస్తుంది. తరువాత ఇంటిలోని సభ్యులకు ఒక్కొక్కరికి జయంతిని పరిచయం చేస్తారు. జయంతి మరునాడు ఒక్కొక్కరి గది పరిశీలుస్తూ మన్‌మోహన్ గదిలో అతని ఫోటోను చూస్తుంది. వారం రోజుల్లో ఆ ఇంటికి పరిసరాలకి అలవాటు పడుతుంది జయంతి. జయంతిని కొత్త వంటమనిషి అన్నందుకు మన్‌మోహన్‌ను గట్టిగా కోప్పడుతుంది సుమిత్రమ్మ. గీత, జయంతి స్నేహంగా ఉండటం పద్మినికి నచ్చదు. పద్మిని తండ్రి తన తమ్ముడి కూతురుని మన్‌మోహన్‌కు చేసుకొమ్మని రఘునాథరావుగారిని అడగగా ఆయన మనూకి జయంతితో సంబంధం స్థిరపడినట్లు చెపుతారు. ఈ మాటవిని పద్మిని జయంతి విషయం తేల్చిచెప్పమని భర్తని నిలదీస్తుంది. గీతతో బజారుకెళ్లిన జయంతిని పద్మిని అవమానిస్తుంది. గీత బర్త్‌డే రోజు జయంతి పాడిన పాట విన్న సుమిత్రమ్మ జయంతిని సంగీతం మాస్టారు దగ్గిర సంగీతం నేర్చుకోమని చెపుతుంది. జయంతి తనకిపుడు సంగీతంమీద ఆసక్తిలేదని చెపుతుంది. కారు యాక్సిడెంట్‌లో పద్మిని మరణిస్తుంది; హరికి కళ్ళు పోతాయి. యాక్సిడెంటులో గాయాలయిన మన్‌మోహన్‌కు తన రక్తం ఇస్తుంది జయంతి. జయంతి వ్యక్తిత్వం మన్‌మోహన్‌ను ఆకర్షిస్తుంది. జయంతి హరి సేవలలో కాలం గడుపుతూ ఉంటుంది. గీతను చూడ వచ్చిన పెళ్లివారు వాళ్ళ అబ్బాయికి జయంతి నచ్చినట్లు రఘునాథరావుకి ఉత్తరం రాస్తారు.

జరగడం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది మన్‌మోహన్‌కు. ఇంతకుముందు ఈ విషయాన్ని ఎవరైనా చెప్పివుంటే అతను చచ్చినా నమ్మేవాడు కాదు.

జయంతీ అందం సంగతి తను అంతగా ఎప్పుడూ పట్టించుకోలేదు. ఎక్కువ చదువుగానీ, ఏ ప్రత్యేకతగానీ లేని జయంతి తన కళ్లకొక పని మనిషిలా కనిపించేది. చివరకా అమ్మాయికి ఫాషన్‌గా అలంకరించుకోవడంకూడా తెలీదు. గతిలేక తమ పంచన పడివున్న ఆ మొరటు పిల్ల తనకు మరదలవుతుందంటే, తన కాబోయే భార్యగా అందరు అనుకుంటున్నారంటే తనకు ఒంటిమీద గొంగళి పురుగులు పాకినట్టుండేది. ఆ పిల్ల తనను తన కాబోయే భర్తగా చూస్తోంది అన్న భావం తనకు చెడ్డ చికాకు కలిగించేది.

చదువు, తెలివితేటలు, సంస్కారం ఏదీ తెలీని పల్లెటూరి మూర్ఖురాలు అనుకుంటూన్న జయంతి యాక్సిడెంట్ జరిగిన నాటి రాత్రి ఎంత ధైర్యంగా, ఎంత చొరవగా, ఎంత ఉదారంగా ప్రవర్తించింది! డాక్టర్ 'రక్తం కావాలి' అనగానే 'నా రక్తం సరిపోతుందేమో చూడ' మందట! ఆ వదులు జాకెట్టు, బిగుతు జడ పిల్లకు ఆ మాత్రం తెలిసి వుండటం తన కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ డాక్టర్ ఫ్రెండ్ చెప్పాక జయంతి కోసం, తన ప్రాణదాత కోసం తానెంత తహ తహగా ఎదురు చూశాడు!

కుర్చీలో మౌనంగా తల వంచుకు కూర్చున్న జయంతి ఎంత అందంగా, ఎంత నాజూకుగా వుండింది! ఆసన్నని లేత పెదిమలు మొదటిసారే అయినా తనతో ఎంత సూటిగా, ఎంత నిర్మొహమాటంగా మాట్లాడాయి!

ఆ వదులు జాకెట్టు మొరటు పిల్ల నాజూకు అమ్మాయిగా, నాజూకు అమ్మాయి గడుసు యువతిగా, గడుసు యువతి లోకం తెలిసిన రచయిత్రిగా... మైగాడ్! జయంతి తన అంచనాకు అందనిది! ఒకనాడు తాను గొంగళి పురుగు అనుకున్న జయంతి ఎంత ఆకర్షణీయమైన సీతాకోక చిలుక!!!

ఇంటి ముందున్న తోటలో కూర్చుని ఆలోచనల్లో తేలిపోతున్నాడు మన్‌మోహన్.

అప్పుడే కాలేజీ నుండి గీత వచ్చింది.

"అన్నయ్యా, మాలతి నీ కోసం అడిగింది. లత 'మనూను చూసి చాలా రోజులైంది. ఈరోజు తప్పకుండా ఓసారి కలవమని చెప్పు' అంది. ఈరోజు ఏవో మేచెస్ వున్నాయటగా? తను అక్కడికి వస్తానంది" అంది అన్నగారి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ.

నవ్వుతూ అన్నాడు మన్‌మోహన్ "నీ మాలతీ లతలకు ఏమీ పని లేదుగానీ మీ జయంతి మళ్లీ కొత్త కథేమైనా రాసిందా?"

"మైగాడ్! జయంతి కొత్త కథ గురించి నీవడుగుతున్నావా!?" అంది ఆశ్చర్యంగా గీత.



## ఈ రాగానికదే తాళం

"ఏం ? నే నడక్కూడదా ? "

"ఎందు కడక్కూడదు ! కానీ జయంతి అంటే నీకు పడదే !" అంది చేదు తిన్నట్టుగా ముఖం పెట్టి.

తడబడ్డాడు మన్ మోహన్.

"జయంతి పడకపోవచ్చు. కానీ ఆమె కథలు బావుంటాయిగా" అన్నాడు సర్దుకుని.

"పోనీలే కథలైనా నచ్చాయి" అంది గీత.

"మరి ఈ విషయం తెలుసా జయంతికి?"

"ఏ విషయం ?"

"అదే. ఆమె కథలు నాకు నచ్చుతాయన్న విషయం."

"ఏమో బాబూ. నీ పేరెత్తితేనే ఆమెగారు విసుక్కుంటారు" అంది గీత బుంగమూతి పెట్టి.

"ఎందుకు ?" మనూ కనుబొమలు ముడి పడ్డాయి.

"ఎందుకేమిటి ! మనమంటే ఇష్టంలేని వాళ్ళంటే మనక్కూడా ఇష్టముండదు. తెలుసా ?"

మన్ మోహన్ ఏదో అనబోయాడు సీరియస్‌గా.

"టెలిగ్రాం."

ఇద్దరూ వులిక్కిపడి చూశారు.

మెసెంజర్ మన్ మోహన్‌కు టెలిగ్రాం అందించి సైన్ చేయించుకుని వెళ్ళిపోయాడు.

ఆదుర్దాగా ఓపెన్ చేసి చూశాడు మన్ మోహన్. ఆత్రంగా అన్న ముఖంలోకి చూడసాగింది గీత. మనూ పెదిమలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. అందమైన అతని ముఖం సంతోషంతో వెలుగురేఖలా భాసించింది.

నవ్వుల కొలనుల్లా వున్న కళ్ళెత్తి చెల్లి వైపు చూస్తూ అన్నాడు "జయంతి కథకు ఫస్ట్ ప్రైజ్ వచ్చింది !"

మొదట అర్థం కానట్టు తెల్లబోయినా మరుక్షణంలో "హే !" అంటూ ఎగిరి గంతు వేసింది గీత.

"ఇటివ్వు" అని టెలిగ్రాం కాగితం లాక్కుని ఇంట్లోకి పరుగు ప్రారంభించింది.

కంగారుగా "ఏయ్ గీతా, ఆగు ఆగు" అంటూ పిలిచాడు మనూ.

పరిగెత్తుతూనే వెనక్కు వచ్చింది గీత "ఏం ?" అని విసుగ్గా అంటూ.

"ఇలా ఇవ్వు" అంటూ కాగితం తీసుకున్నాడు మన్ మోహన్.

"జయంతికి నేనిస్తాను. నీవిక్కడే వుండు" అంటూ ముందుకు సాగిపోయాడు.

ఈ వింతకు తెల్లబోయి చూస్తూ నిలబడి పోయింది గీత.

* * *

హరికి ఓవల్టిన్ తీసుకుని మేడ మెట్లెక్కుతోంది జయంతి. క్రిందినుండి పిలిచాడు మన్ మోహన్ "జయంతీ."

ఆశ్చర్యంగా వెనక్కుతిరిగి చూసింది జయంతి.

"నీకు టెలిగ్రాం."

జయంతి కనుబొమలు ముడిపడ్డాయి. దాదాపు పైకి వెళ్ళిపోయినదల్లా వెనక్కు తిరిగి నెమ్మదిగా ఒక్కొక్క మెట్టే దిగి వచ్చింది ఆలోచిస్తూ. బహుశా తనకు టెలిగ్రాం ఇచ్చే వాళ్ళు ఎవరా ? అని కాబోలు.

క్రింది మెట్లుమీదకు వచ్చి నిలబడిన జయంతికి మన్ మోహన్ టెలిగ్రాం కాగితం ఇవ్వబోయాడు. అంతలోనే మనసు మార్చుకుని చేతిని వెనక్కు తీసుకున్నాడు.

"ఊహూ. నేనే చెబుతాను" అన్నాడు చిరునవ్వుతో.

తెల్లబోయింది జయంతి. ఏమిటీ పరిహాసం అన్నట్లుగా చూసింది.

"నీకు... నీ కథకు మొదటి బహుమతి వచ్చింది" మృదువుగా అన్నాడు మన్ మోహన్, జయంతి కళ్ళలోకి చూస్తూ.

మబ్బు తొలగిన చందమామలా ప్రకాశవంతమైంది జయంతి ముఖం.

'నిజం !?' అన్నట్లుగా మనూ ముఖంలోకి చూసింది.

వాళ్ళిద్దరూ ఆత్మీయుల్లా మొదటిసారిగా చూసుకున్న క్షణం అదే. తనకళ్ళలోకి ప్రసన్నంగా, సంతోషంగా చూసిన జయంతిని ముగ్ధుడై చూశాడు మనూ.

సమాధానం చెబితే జయంతి చూపు తిప్పేసుకుంటుందన్న భయంతో చాలా సేపు తాత్సారంచేసి, ఇక తప్పదన్నట్లుగా 'నిజమే' అన్నట్లుగా తలవూపి కాగితం అందించాడు.

అందుకుని రివ్వున పైకి పరిగెత్తింది జయంతి

"జయంతీ."

సగం మెట్లు ఎక్కిన జయంతి ఆగింది.

"ఇంత మంచి వార్త చెప్పాకదా ? కనీసం థేంక్స్ కూడా..." పైకి చూస్తూ దీనంగా అన్నాడు మన్ మోహన్.

పెదిమలు బిగించి వచ్చే నవ్వు నాపుకుంది జయంతి. తర్వాత మెడ మాత్రం వెనక్కు తిప్పి 'థేంక్స్' అని సీరియస్‌గా అని చకచకా పైకి వెళ్ళిపోయింది.

బరువైన జడ సన్నటి నడుము మీద అటూ ఇటూ కదలాడగా 'థేంక్స్' అన్న ఒక్క మాట అనేసి తనంటే ఏ మాత్రం లక్ష్యం లేనిదానిలా అలా పైకి వెళ్ళిపోయిన జయంతికేసి చూస్తూ నిట్టూర్చాడు మన్ మోహన్.

అంత మంచి కబురు చెప్పాడు తను. ఆ సంతోషాన్ని తనతో పంచుకోకూడదూ ? ఆ కథ

గురించిన విశేషాలు చెప్పకూడదూ ? ఒక్కమాట ఒకే ఒక్క మాట 'థేంక్స్'. అదీ తనడిగితే ! ఓహో ! తనకు తెలీలేదు గానీ ఈమె గారికి టెక్కు కూడా వుంది !

పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని విసుగ్గా అడుగులేస్తూ బయటకు వెళ్లిపోయాడు మన్‌మోహన్, అన్నగారి మాటమీద ఇంకా తోటలోనే నిలబడిన గీత పిలుస్తున్నా పలక్కుండా.

జయంతీ, మన్‌మోహన్‌కు మధ్య ఈ పరుగు పందెం మామూలయింది. ఏదో సాకు కల్పించుకుని మాట్లాడాలనే ప్రయత్నం మన్ మోహన్ దయితే అతని నుండి మెరుపులా తప్పుకోవటంలో జయంతి ఎప్పటికప్పుడు విజయం సాధిస్తోంది. ఈ అందీ అందని అందం మన్ మోహన్‌కు మరీ ఆకర్షణగా తయారయింది.

## 22

హాల్లోని సోఫాలో కూర్చుని కాఫీతాగుతున్నాడు మనూ. ఎక్కడికో బయలుదేరబోతూన్నట్టుగా చక్కగా డ్రెస్ అయి వున్నాడు. అతను కాఫీ పూర్తిచేసి కప్పు టీపాయ్‌మీద పెడుతూ గుమ్మం దగ్గర చప్పుడుకు అటువేపు చూశాడు. ఐదారు మంది అమ్మాయిలు "మే అయ్ కమిన్ సర్ ?" అన్నట్టుగా గుమ్మంలో నిలబడివున్నారు.

"కమిన్" అన్నాడు మన్‌మోహన్.

వాళ్లు లోపలకు వచ్చారు.

మన్‌మోహన్ లేచి నిలబడి మరో సోఫా చూపిస్తూ "కూర్చోండి" అన్నాడు. వచ్చిన వాళ్లు రెండు సోఫాల్లో సర్దుకోగా తను సింగిల్ సోఫాలో కూర్చున్నాడు.

"గీత కోసం వచ్చారా ?" అని అడిగాడు.

"గీతా ! ఊహూ. జయంతిగారి కోసం వచ్చాము" అంది ఓ అమ్మాయి.

జయంతి కోసమా ! మన్‌మోహన్‌లో ఆశ్చర్యం, కుతూహలం కలిగాయి.

"మీరు జయంతి స్నేహితులా ?"

"ప్రస్తుతానికి కాదు. రచయిత్రి కదా ? మేము వారి అభిమానులం. చూసి మాట్లాడాలని వచ్చాము."

అభిమానులా !

మన్‌మోహన్‌కు బుర్ర తిరిగిపోయింది.

అభిమానులు !

'వారి' అభిమానులు !!

"జయంతిగారు ఇంట్లో వున్నారా ?" ఒకమ్మాయి అడిగింది.

"ఉంది" అన్నాడు పులికిపడి.

"ప్లీజ్" అన్నారు అందరూ.

"మంగమ్మా" కేకశాడు మన్‌మోహన్.

లోనుండి వెంటనే వచ్చింది మంగమ్మ.

"జయంతిని పిలువు. ఎవరో వచ్చారని చెప్పు."

మంగమ్మ వచ్చినవాళ్లను వింతగాచూస్తూ లోనికి వెళ్లింది.

ఆ అమ్మాయిలు హాలంతా పరిశీలనగా చూడ్డం గమనించాడు మన్‌మోహన్.

చిరునవ్వు నవ్వుతూ "ఏమిటలా చూస్తున్నారు ?" అన్నాడు.

"రచయిత్రి కదా ? ఇంటిని అలంకరించుకోవడంలో ఆమెగారి అభిరుచి ఎలా వుందోనని." అంది మరో అమ్మాయి.

మిగిలినవాళ్లు మా వుద్దేశమూ అదే అన్నట్టుగా చూశారు.

ఇంతకు ముందయితే 'దాని బాబు ఇల్లు కాదు, దాని అభిరుచి మేరకు వుండడానికి' అనేవాడు. ఇప్పుడా మాట అనలేకపోయాడు. పైగా తమ ఇల్లు ఒక రచయిత్రి ఇంటిగా ప్రత్యేకతను సంతరించుకోవటం అతనికి కాస్త గర్వకారణంగా కూడా అనిపించింది.

నిజానికి ఇల్లు తమదే అయినా అలంకరణ, అభిరుచి, జయంతివే. జయంతి వచ్చాక ఇంటి స్వరూపం చాలా మారిపోయింది. అప్పటి అలంకరణలో ఆడంబరం కృత్రిమత్వం ఎక్కువగా వుండేవి. ఇప్పుడు నిరాడంబరం, సహజత్వం చోటు చేసుకున్నాయి. కర్టెన్లు, సోఫా కవర్లు, తివాసీలు కొట్టొచ్చే ముదురు రంగుల్లోంచి ఇంపైన తేలిక రంగుల్లోకి మారాయి. వాజుల్లో ప్లాస్టిక్ పువ్వులు కాస్త తాజా పువ్వులుగా జీవం పోసుకున్నాయి. ఎక్కువ ఫర్నిచర్‌తో ఇరుగ్గా వుంటే హాలు, అవసరమైనంత సామగ్రితో విశాలంగా మారిపోయింది. ఇలాంటివే ఎన్నో మార్పులు !

"జయంతి గారికి మీరేమవుతారు ?"

ఉలికిపడ్డాడు మనూ.

"జయంతి నాకు 'మరదలవుతుంది' అనడానికి చికాకు పడలేదు మన్‌మోహన్. నిస్సంకోచంగా చెప్పేశాడు.

"చాలా అదృష్టవంతులు"

కనుకొలుకుల్లోంచిచూశాడు మన్‌మోహన్.

"అంత అందమైన, గొప్ప రచయిత్రి మరదల్ని వదులుకునే మూర్ఖులు ఎవరుంటారు ?" సిసింద్రీలా వున్న అమ్మాయి అంది.

"ఎందుకుండరు ? ఆ మూర్ఖుణ్ణి నేనే" మనసులో గొణుక్కున్నాడు మనూ.

"జయంతిగారు రాయబోయే కథల గురించి మీతో చర్చిస్తారా ?"

ఏం చెప్పాలో తోచలేదు మన్‌మోహన్‌కు. అయినా ఏదో ఒకటి చెప్పాలిగా.

"ఎవరైనా సరే, ఆమె కథలు అచ్చులో చదువుకోవటమే ఆమె కిష్టం" అన్నాడు. జయంతి గురించి ఇలా ఇంత గౌరవప్రదంగా తాను మాట్లాడవలసి రావటం అతనికి చిత్రంగా అనిపించింది.

"రాసిన కథలు జయంతిగారే ఫేర్ చేస్తారా లేక ..."

మన్‌మోహన్‌కు కోపం లాంటిది వచ్చింది. చెట్టంత మనిషి ఎదురుగా తనున్నాడు. అందగాడు. కాబోయే లాయర్. పైగా గొప్ప స్పోర్ట్స్‌మాన్. తన గురించి ఒక్క ప్రశ్న వేయరు. తన గురించి ఏ మాత్రం ఆసక్తి లేనట్టుగా ఎంతసేపూ జయంతిగారు ! జయంతిగారు

ఉక్రోషంతోపాటు అక్కడే వుంటే ఇంకా ఏం ప్రశ్నలు వేస్తారోననే భయం కలిగింది.

"జయంతిని పంపుతాను" అంటూ లేవబోతూండగా కర్టెన్ తొలిగించుకుని లోపలి గది లోంచి హాల్లోకి వచ్చింది జయంతి. అప్పుడే స్నానం చేసి వస్తున్నట్లుంది, చలువ చేసిన వాయిల్ చీరెలో, సబ్బు, పౌడరు తాలూకు పరిమళాలతో తాజాగా, విరిసిన పువ్వులా వుంది జయంతి.



# ఈరాగాని కదే తాళం

పరిచయం చేసే బాధ్యత నుండి తప్పుకో లేకపోయాడు మన్‌మోహన్.

"ఈమే జయంతి. జయంతి వీళ్ళంతా నీ అభిమానులట. నిన్ను కలుసుకోవడానికి వచ్చారు" అన్నాడు.

అమ్మాయి లందరూ చటుక్కున లేచి నిలబడ్డారు. అంతవరకూ గడుసుగా మాట్లాడిన వాళ్ళు జయంతిని ఆరాధనగా చూస్తూ సౌమ్యంగా "నమస్తే" అన్నారు.

'నీ అభిమానులు' అనగానే జయంతి వుబ్బి పోతుందనీ, తొట్రుపడుతుందనీ అనుకున్న మన్‌మోహన్‌ను ఆశ్చర్యంలో ముంచి వేస్తూ అలవాటైన అతి సామాన్యమైన చిరునవ్వు నవ్వుతూ "నమస్తే. కూర్చోండి" అంది.

అంతవరకూ తను కూర్చున్న సింగిల్ సోఫా జయంతికి ఆఫర్ చేస్తూ "క్షమించాలి. నాకు పనివుంది" అంటూ అక్కడినుండి తప్పు కున్నాడు మన్‌మోహన్.

బయటకు వచ్చాడన్న మాటేగాని అతని మనసు మనసులో లేదు.

ఆ ఇంటికి తానే యజమానురాలు అన్నంత సహజంగా గదిలోంచి హాల్లోకి వచ్చి చిరునవ్వుతో తన అభిమానులకు ప్రతి నమస్కారం చేసిన జయంతే అతని కళ్ల ముందు కదలాడసాగింది.

అందమైన ఆ ఇంట్లో జయంతి, డ్రాయింగ్ రూంలోని పూల కుండీలా, ఎంత చక్కగా అమరివుంది ! ఈ మధ్య జయంతిని తాను వీలయినంత ఎక్కువగా గమనిస్తున్నాడు. ఏ పని చేస్తున్నా, చేయిస్తున్నా, ఇంట్లో తిరుగాడుతున్నా శరీరంలోని గుండెలా, కంటిలోని పాపలా ఎంతో నేచురల్‌గా వుంది. ఇదివరకు తన వదిన పద్మిని వుండేది. ఆమె ఇంట్లో వున్నంతసేపూ, చక్కగా తయారై పలకరింపులకు వచ్చిన అతిథిలా అనిపించేదేగానీ ఇంటి మనిషిలా కలిసిపోయి కనిపించేది కాదు. ఈ జయంతి పాలలో కలిసిపోయిన తేనెలా ఆత్మీయంగా, ఇంటికి తోటలా అందంగా, స్తంభించిపోయిన జీవితాలకు చైతన్యంగా వుంది !

ఈ జయంతినా తను అనాగిరికురాలని అసహ్యించుకున్నది ! ఈ జయంతినా తను పని మనిషిలా ఈసడించినది ! ఈ జయంతినా తను మూర్ఖత్వంతో వదులుకోబోయింది ! ఊహూ. అలా జరగడానికి వీల్లేదు.

పాము కాటు తినబోయి తప్పించుకున్న వాడిలా అతని మనసు భయంతో, ఆనందంతో, గగుర్పాటుతో వుక్కిరిబిక్కిరి అయిపోయింది. ఇంట్లో గుప్త నిధిని దాచుకున్నవాడిలా అటూ ఇటూ అస్థిమితంగా కాసేపు తిరిగి మళ్లీ ఇంటి దారిపట్టాడు. ఇంటికి వస్తూ వుంటే చాలా ఏళ్ల తర్వాత అతి ప్రియమైన వ్యక్తిని కలుసుకో

## అరణ్యం

కోరికల గచ్చపొదల గలగల
కూరుముల ముళ్లకొనల విల విల
బాధ్యతల ఘూకమ్ముల కేకలు
బంధాల వ్యాఘ్రాల మూకలు
నిత్యావసరాల కార్చిచ్చులు
ప్రత్యహ వాంఛల కొండముచ్చులు
నిండిన ఈ బ్రతుకంతా
నిజంగా పెద్ద అరణ్యం !

— వజ్ఝల కాళిదాసు

బోతున్న వాడిలా మన్‌మోహన్ హృదయం ఆనంద తరంగితమయింది.

## 23

ఆ రోజుకు మూడు రోజులుగా జయంతికి జ్వరం వస్తోంది. పనివాళ్లు హడావుడిగా తిరగడం, డాక్టర్ వచ్చి వెళ్లడం, ఈమధ్య మేడ మీదికే రాని సుమిత్రమ్మ మేడపైకి రావడం, రఘునాథరావుగారు, హరితో సహ అందరూ జయంతి గదిలోకి ఆదుర్దాగా వచ్చి వెళ్తూండడం మనూ గమనిస్తూనే వున్నాడు. అతనికి జయంతి దగ్గరకు వెళ్లాలనీ, పలకరించాలనీ, అందరిలా ఆత్మీయంగా పరామరిక చేయాలనీ ఎంతగానో వున్నా నలుగురికి తెలిసేలా ఎన్నడూ జయంతి పట్ల ఆదరణ కనబరచని తను, ఈనాడు ఈ మాత్రం ఆసక్తి చూపించాలంటే చాలా మొహమాటంగా వుంది. అందరి చూపుల్లో కనిపించబోయే ఆశ్చర్యాన్ని వూహిస్తేనే చచ్చేంత బిడియంగా అనిపిస్తోంది. కానీ జయంతిని ఒంటరిగా కలుసుకుందామంటే గదిలో ఎప్పుడూ ఎవరో ఒకరు వుంటున్నారు.

ఆ రోజు జయంతిని చూడాలనే తపనను ఆపుకోలేకపోయాడు మన్‌మోహన్. బాల్కనీ లోంచి గదిలోకి వున్న కిటికీలోంచి తొంగి చూశాడు.

గదిలో జయంతి, మంగమ్మ, హరి వున్నారు. జయంతి వడలిపోయిన పూవులా అతి నీరసంగా మంచంమీద పడుకుని వుంది. జ్వరంతో భారమైన కళ్లను అరమోడ్చి హరి ఏదో చెబుతోంటే వింటోంది.

ఎప్పుడూ ఏదో పనిచేస్తూ, చల్లని పిల్ల తెమ్మెరలా ఆ గదిలోంచి ఈ గదిలోకి, ఈ గది లోంచి ఆ గదిలోకి తిరుగాడే జయంతి ఎన్నడూ లేని విధంగా నీరసంగా, నిస్త్రాణగా అలాగే మంచంమీద పడుకుని వుంటే మనసంతా కలిచి వేసినట్లయింది మన్‌మోహన్‌కు. ఒక్క క్షణం

# ధర్మపథం

—బులుసు వేంకటరమణయ్య




కాశీ పరమ పవిత్రమైన క్షేత్రం. అక్కడి గంగానదిలో స్నానంచేసి, విశ్వేశ్వరుని దర్శనం చేసుకుంటే సమస్త పాపాలూ నశిస్తా యని పురాణాలు చెప్తున్నవి. ఇతరత్రా చేసిన పాపాలు అక్కడికివెళ్లితే నశిస్తాయి. అక్కడ చేసిన పాపానికి మాత్రం విడుదల ఉండదు. అందువల్ల ఇంద్రియ విషయాలకు లోను కాకుండా త్రికరణశుద్ధితో ప్రవర్తించాలి... అది కత్తితో సామువంటిది. మహా మునులే ఇంద్రియ విషయాలకు గురియై యుక్తా యుక్త వివేకంలేక ప్రవర్తించి కష్టాలు పొందడం కానవస్తుంది.

వ్యాసమహర్షి శిష్యులతోకూడా కాశీ క్షేత్రంలో నివసిస్తూ ఉండేవాడు. ఆయన ఉదయాన్నే గంగలో స్నానంచేసి శిష్యులతోసహా నివాసానికివచ్చి మధ్యాహ్నంవరకూ జప తపాదులు చేసుకుని అందరూ వేర్వేరు వీధులకు భిక్షానికి వెళ్లేవారు. అందరూ తెచ్చిన భిక్షాన్నాన్ని ఒక చోట పోసి, అందరూ పంచుకొని తినేవారు. ఆ అన్నం వారికి సమృద్ధిగా సరిపోయేది. అలా కొంతకాలం గడిచింది.

వ్యాసుని ఇంద్రియ నిగ్రహాన్నీ, క్షేత్రం పైగల భక్తినీ పరీక్షించదలచి, విశ్వేశ్వరుడు అన్నపూర్ణాదేవితో ఆలోచించి, కొద్ది రోజుల పాటు అతనికి అక్కడ భిక్ష పుట్టకుండాచేశాడు. తొలి రోజున భిక్షానికి వెళ్లినవాళ్ళందరూ ఉత్త చేతులతో తిరిగివచ్చారు. వ్యాసమహర్షికి నిరుత్సాహం కలిగింది. మర్నాడు కూడా అదే విధంగా జరిగింది. ఏ యిల్లాలూ వీరిని గమనించలేదు. వ్యాసుడూ, శిష్యులూ ఆకలితో బాధపడుతూ... మూడోరోజు కూడా తిరిగి ఉత్త చేతులతో నివాసం చేరుకున్నారు. వ్యాసునికి కాశీ పైని, ప్రజల పైనీ కోపం వచ్చి మూడుతరాల దాకా ముక్తీ, భుక్తీ, ధనమూ లేకుండా ఉండేటట్లు శపించడానికి శాపోదకం పట్టుకున్న సమయంలో అన్నపూర్ణాదేవి ముసలి ముత్తయిదువ వేషంతో వచ్చి, వారినందర్నీ తన యింటికి తీసుకు వెళ్లి సమృద్ధిగా భోజనం పెట్టినది. తర్వాత గృహ యజమాని వేషంలో ఉన్న మహేశ్వరుడు వ్యాసుణ్ణి కోపించి ''ఏమయ్యా! రెండు మూడు పూటలు తిండికి దొరక్కపోతే పుణ్య రాశియైన కాశీని శపించడానికి సిద్ధపడ్డావే! ఇలా సహనంలేని వాడవు వేదాలను ఎలా విభజించావు? అష్టాదశపురాణాలనూ, భారతాన్నీ ఎలా రచించావు? అయోగ్యుడవైన నీవు ఈ కాశీని విడిచిపో'' అని నిజరూపం చూపి గద్దించాడు. వ్యాసుడు శిష్యులతో గంగ ఆవలి ఒడ్డుకు పోయి అక్కడే నివసించేడు. అదే వ్యాసకాశీ. రామనగర్ అని కూడా అంటారు. కాశీకి ఎదురుగా — గంగానది తూర్పు తీరాన ఉన్నది. ★

---

అటు గుమ్మంలోంచి గదిలోకి వెళ్లి జయంతిని ఒళ్లోకి తీసుకుని సేద తీర్చాలనిపించింది!

ఊహూ, తనకంత అదృష్టంలేదు. ఆ అవకాశాన్ని తను చేజేతులా జారవిడుచుకున్నాడు. జయంతి, ఆమె పరిధిలోకి తన గాలిని కూడా జొరనివ్వటంలేదు. తను ముందుగా జయంతి మనసును గెలుచుకోవాలి. ఔను. అంతే.

హఠాత్తుగా జయంతి చూపు మన్‌మోహన్‌మీద పడింది. ఆమె కళ్లు అతి కష్టంమీద చికిలించి చూసింది. ఆమె మన్‌మోహన్‌ను గుర్తించినట్లుగా, గుర్తించిన దాన్ని ధృవీకరించుకున్నట్లుగా ఆమె కళ్లలో భావాలు త్వర త్వరగా, స్పష్టంగా కదలాడాయి. ఆ తర్వాత ఆ కళ్లలో ఆశ్చర్యం, దానివెంట ఇబ్బంది...

జయంతి చప్పున కళ్లు వాల్చుకుంది.

మన్‌మోహన్ చటుక్కున ఇవతలకు వచ్చేశాడు.

*    *    *

మరునాడు ఉదయం ఆతృతగా మళ్లీ కిటికీదగ్గరకు వెళ్లాడు మన్‌మోహన్.

కిటికీకేసి చూసిన మనూ మెరుపుదెబ్బ తిన్నవాడిలా అయిపోయాడు.

ఎన్నడూ లేని విధంగా ఆ కిటికీ మూసి వుంది!

ఎవరు మూశారు? ఎవరు మూసినా ఆ చర్య వెనక వుద్దేశం మాత్రం జయంతిదే అయి వుండాలి. నిన్న తను కిటికీలోంచి చూడటం ఎవరు చూశారు? హరి తన కభిముఖంగానే వున్నా అతను అంధుడు. తనను చూడలేదు. మంగమ్మ తనవైపు వీపుపెట్టి క్రింద నేలమీద కూర్చుని వుండింది. తనను చూసే అవకాశ మున్నదీ, చూసిందీ జయంతి మాత్రమే! అంటే... అంటే... జయంతి కావాలని కిటికీ మూయించిందా! మిగిలిన ఇద్దరికీ తనను చూసినాకూడా కిటికీ మూయాల్సిన అవసరం లేదు. ఔను! జయంతే... జయంతే...!

చెప్పలేనంతగా బరువెక్కిన గుండెను మోస్తూ మనూ కాళ్ళు అతి భారంగా అతన్ని గదికేసి సాగాయి.

**(ఇంకా వుంది)**

# శూర్పణఖ శోకం

## కవన శర్మ

రామరాజు భగభగమని మండిపోయాడు. కుతకుతలాడిపోయాడు. పొగలు చిమ్మాడు. ఆవిర్లు కక్కాడు. తనకి జరిగిన అవమానానికి ప్రతీకారం చేసి తీరాలని నిర్ణయించుకొన్నాడు.

అతనికి రావణరావు, తన కన్నుకప్పి సీత నెత్తుకుపోవడం అవమానం అనిపించింది. పగవాడి దగ్గర తన భార్య ఎటువంటి కష్టాలు పడ్తోందో అన్న ఆలోచన కాదతన్ని బాధపెడ్తు. పగవాడు తనభార్యతో సరసాలాడ్తుంటే తనుగాజులు తొడుక్కూర్చున్నాడని జనం నవ్విపోతారేమోనని బాధ పడ్డాడు. రావణరావు ఇంతకింత అనుభవించాలి ! అప్పుడే తన మనస్సుకి శాంతి, పౌరుషానికి విలువ.

ఆలోచనలతో వేడెక్కిన రా మ రా జు, లచ్చుమయ్య అనుసరించి రాగా చుట్టు పట్ల ప్రదేశాలు చుట్టిరావటానికి వెళ్లాడు. దక్షిణంగా కొంతదూరం పోయేసరికి ఓపూలతోట కనిపించింది.

"మన రావణ్రావుగోరి సెల్లెల్తోటన్నా" అన్నాడు లచ్చుమయ్య.

"తెలుసు" అన్నాడు గంభీరంగా రామరాజు. ఆపైన—

"అయితే ఏం చెయ్యమంటావు !" అని లచ్చుమయ్యని కసురుకొన్నాడు.

"నానేటి అనన్నా ! నీకూరికే గాపకం సేసా."

"ఏట్రా! ఈ శూర్పణఖ ఆ రావణాసురుడి చెల్లెలని నువ్వు గ్నాపకం చెయ్యాల్రా !" అని విసుక్కున్నాడు.

తను కాలేజీలో చదువుకొనే రోజుల్లో ఈ పిల్లకి చుప్పనాతి గుణం ఉందని, రావణ్రావు చెల్లెలని శూర్పణఖ అని పేరు పెట్టారు అబ్బాయిలు. తనంటే అభిమానం చూపించేది. రావణరావు ఆమెకు మంచి సంబంధమే చేసాడు. ఆమె మొగుడు మరోదాన్ని చూసుకొని ఈమెనొది లేసినప్పటి నుంచి ఈ తోట చూసుకొని పూలు పళ్లూ అమ్ముకొని బతుకుతోంది దర్జాగా. అప్పుడప్పుడు తన పర్ణశాలకి వచ్చి సీతని పలకరించిపోతూ ఉండేది. కాని ఈ మధ్య రావటం మానేసింది.

"నన్ను మీరు అభిమానంగా చూసుకొంటారని ఆ పిల్లకి కొంచెం అసూయ" అంది సీతోసారి తనతో నవ్వుతూ.

అలా నవ్వి ఊరుకొందేగాని శూర్పణఖతో రాకపోకలు తెంపుకోలేదు. మొహం చెండుకోలేదు.

తనకోసం సీత ఎదురుతెన్నులు చూసేది తనెక్కడికైనా వెళ్తే !

ఆ రోజు లచ్చుమయ్య, తను ఇంటికి వచ్చేసరికి గుమ్మంలో సీత తనకోసం ఎదురు చూస్తూ నిలబడిలేదు. ఆ రోజు రామరాజుకి గుర్తుకువచ్చింది.

"సీతా !" అని పిలిచాడు. సీత పలకలేదు.

"సీతా !" అని అరిచాడు. సీత ఓయ్ అని జవాబివ్వలేదు.

"సీతా !" అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్టు కేకపెట్టాడు. సీత పరిగెత్తుకురాలేదు.

సీత తనతో చెప్పకుండా టౌన్లో సినిమాకైనా వెళ్లదే ! చీటి పెట్టిందేమోనని ఇల్లంతా వెతికాడు. అటువంటి చీటీ ఏదీ కనిపించలేదు.

అప్పుడు రామరాజుకి గుర్తుకువచ్చింది తను దశకంఠస్వామి సేవలకి సీతని నియోగించినట్టు. తోటలో ఓ మూలగా ఉన్న పాకవైపు నడిచాడు. అక్కడ అలికిడి లేదు. లోపలికి వెళ్ళి చూసాడు. పూజాద్రవ్యాలు ఎక్కడ పెట్టినవి అక్కడే ఉన్నాయి. గది ఏదో వాసన, ఆసుపత్రి రకం వాసన వేస్తోంది. ఎవరికైనా దెబ్బలు తగిలాయేమో ! అనుకొన్నాడు.

బయటికి వచ్చి "లచ్చుమయ్యా !" అని పిలిచాడు.

"వస్తున్నా ! అన్నా !" అని వచ్చాడతను.

"అమ్మేదిరా ! ఎధవా !" అని అడిగాడు రామరాజు.

"నాకు తెల్దన్నా ! నాన్నితో ఒచ్చిసినాను కాదా !"

"నేను రమ్మనన్దే ఎందుకొచ్చావురా ఎధవన్నరెధవా !"

"నువ్వు రమ్మననేదు. అమ్మ పొమ్మంది. పోయి సూడు ! మన కారు దూరాన్న ఆగిపోనట్టుంది. తొయ్యాల్తో ! ఏటో ! పోయి సూడు. ఇదసలే అడవి. అక్కడ మన కార్నేకపోతే ఎనిక్కి పొ్రా. అది మన కారే అయితే ఈ సంచట్టుకెల్లి అన్నతో సెప్పి. టౌన్నుంచి నాన్సెప్పిన సరుకుల్దెచ్చీ. అందన్నా! నేనోచ్చిసరికి నువ్వు కారుకింద తొంగునున్నావు కాదా ! నాను కారు దార్లో మారోపాలి తొయ్యడాని కుందామని లోపలి కూకుండిపోనాము గమ్మున."

"ఈ స్వామిజీ ఏడ్రా ?"

"నా కెరికనేదన్నా !"

నిశ్శబ్దం తాండవించింది కాస్సేవు.

"అమ్మనెంటేసుకొని సాములోరు ఈస్వరుడి గుడికెళ్ళుండడా !" అన్నాడు లచ్చుమయ్య.

"లేపుకొనిపోయాడన్నావు కాదురా నా కొడకా !" అని కసురుకొన్నాడు రామరాజు లచ్చుమయ్యని.

రామరాజుకి అనుమానం మర్రివిత్తనంలా పడింది. కాస్సేపట్లో అది మహా వృక్షమైపోయింది. "ఇందాక సామి పాకలో నాకేసిన వాసన ఏటై ఉంటుంది !" అని ఆలోచనలోపడి మరోసారి ఆ పాకలోకెళ్లాడు. ఆ వాసన మరోసారి పీల్చి క్లోరోఫామ్ అని పోల్చుకొన్నాడు.

"నువ్వు దొంగ స్వామివిట్రా దొంగనాకొడుకా ! పోల్చుకోలేకపోయాను. నాకు టోపీ వేస్తావుట్రా ! కేటు నాకొడకా ! నా పెళ్లాన్నెత్తుకు పోతావుట్రా తొత్తునాకొడకా" రామరాజు బుసకొట్టాడు.

సీతకోసం, స్వామికోసం, గాలించాడు. చావడానికి సిద్ధంగా ఉన్న జట్కాబండి వాడు "నా పక్కనుంచి రాకెట్టునాగా మోటారు దూసుకుపోనాది బాబు. దానెనకాతల అమ్మగోరు మూటలా కూకునున్నారు. దాన్ని తప్పకోబోయినాను. గోతిలో అడిపోయి సావు దెబ్బలు తిన్నాను" అని చెప్పాడు.

రామరాజుకి జరిగినది అర్థమైంది. "ఇది రావణరావుగాడిపని" అని పోల్చుకొన్నాడు.

రావణరావుకి రామరాజుకి వ్యాపారంలో ముక్కోదురు. రావణరావు ఆ ఊరివాడు. రామరాజు తండ్రి మరో జిల్లానుంచి వచ్చి ఆ ఊళ్ళో స్థిరపడ్డవాడు. రావణరావు, వంశపారంపర్యంగా వస్తున్న వ్యాపారం చేస్తుంటే రామరాజు ఆ వ్యాపారంలో దిగి దాంట్లో ఏకచ్ఛత్రాధిపత్యం సంపాదించాలని ప్రయత్నించసాగాడు. దానితో రావణరావుకి మండసాగింది.

రావణరావు తన నమ్మకస్తులను రామరాజు పనిలోపెట్టి, కూపీలు లాగి ఇన్కమ్టాక్సు వాళ్లకి ఆ కూపీలందించాడు. రామరాజు తన వ్యాపారం అంతా సవితి తమ్ముడికి అప్పగించి తప్పుకొన్నాడు. ఆ తమ్ముడి మేనమావకి బోలెడు పలుకుబడి ఉంది. అతగాడు డబ్బు వెదజల్లి కేసులు మాఫీ చేయించే ప్రయత్నింలో పడ్డాడు.

రామరాజు రెండేళ్ల క్రితం టౌనుకి దూరంగా ఉన్న తోట ఎందుకైనా పనికి వస్తుందని కొన్నాడు. వ్యాపారంలోంచి తాత్కాలికంగా తప్పుకొన్న రామరాజు మంచి పేరు తెచ్చుకొని, బురద కడుక్కునే ప్రయత్నంలో ఆ తోటలో అన్ని వసతులతో ఇల్లు కట్టుకొని

కాపురం పెట్టాడు. లచ్చుమయ్యని తోడు తీసుకువెళ్లాడు.

ధనం పట్ల తన కాపేక్షలేదని నిరూపించు కోడానికి నారబట్టలు ధరించసాగాడు. యోగ్యుడన్న బిరుదు సంపాదించడానికి సత్సంగం పెట్టుకొన్నాడు. దేవుని ఏజెంట్లయిన స్వామిజీల కంటే ఇంకెవరు యోగ్యతా పత్రాలు ఇవ్వడానికి అర్హులు! అని ఆలోచించి స్వామీజీలపై తన దృష్టి తిప్పుకొన్నాడు.

అటువంటి రోజుల్లో అతను దశకంఠ స్వామీజీ గురించి విన్నాడు. ఆ స్వామి ఈశ్వరార్చన చేస్తుంటే పది కంఠాలతో పాడి నట్టుంటుందని, "ఘంటసాల, బాలసుబ్రమణ్యం, రాజా, మాధవపెద్ది, పిఠాపురం, ఎమ్మెస్ రామారావు, పి. బి. శ్రీనివాస్, రఘురామయ్య, సూరిబాబు, రాజేశ్వరరావు కంఠాలు ఆ పది కంఠాలతో పలికిస్తాడని విన్నాడు. రామరాజు ఆ స్వామిజీని తన పర్ణశాలకి వచ్చి ఓ వారంపాటు భిక్ష స్వీకరించమని కోరాడు. స్వామి అంగీక రించాడు.

రామరాజు బలహీనత తెలిసిన రావణరావే ఆ వేషం వేసాడని రామరాజుకి తెలియదు.

అతని దురాలోచన తెలిసిన రావణరావు భార్య, "మీరు, మీరు బలాబలాలు తేల్చుకోవాలి గాని, సీతను మీరు ఎత్తుకురావటం ధర్మం కాదు. ఆ రామరాజు నన్నెత్తుకుపోతే మీరు భరించగలరా!" అని బుద్ధి గరపబోయింది.

"నోరు మూసుకో! నేనతనిలాగా ఫూల్‌ని కాను. ఊరుకి దూరంగా పాకేసుకొని నీతో కాపురం చెయ్యడంలేదు. నీకు పదిమంది పనివాళ్లు కాపలా! అయిదు వేటకుక్కలు కాపలా! నీకేసి తేరిపార చూడ్డానికి కూడా రామరాజు వశం కాదు" అని గర్వంగా మీసం మెలివేసాడు రావణరావు.

దశకంఠస్వామి వేషంలో రామరాజు తోటలో పర్ణశాల నుంచి దూరంగా పాకవేయించుకొని మకాంపెట్టాడు. సమయం చూసుకొని క్లోరోఫామ్‌తో సీతను వశపర్చుకొని సీత నెత్తుకు పోయాడు. తనకి లంకంత కొంప ఉన్నా సీతను మరోచోట దాచాడు, రామరాజు సైన్యంతో వచ్చినా ఉత్త చేతులూపుకొంటూపోవాలని. "ఈ రామరాజేమి చెయ్యగలడు! ఏ సాక్ష్యమూ లేదు నాకు వ్యతిరేకంగా" అని విర్రవీగాడు.

రావణరావు శూర్పణఖ విషయం మర్చి పోయాడు. కాని రామరాజు కారోజు శూర్పణఖ రావణరావు చెల్లెలన్న విషయం గుర్తొచ్చింది.

మరురోజు రామరాజామె యింటికేసి షికారెళ్లినట్టు వెళ్లి "ఓసారి మా తోట చూడ్రాదా! మా సీత లేదని రావటం మానేసి నట్టున్నారు" అని శూర్పణఖని పిలిచాడు. అందులో "సీత లేదు నేను ఒంటరిగా ఉన్నానన్న" అర్థం శూర్పణఖకు వెంటనే అర్థమైపోయింది. ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్న శూర్పణఖ ఆ రోజుల్లో ఫైనలియరు బియ్యే చదువుతున్న రామరాజుకి ఓటేసి యూనియన్ ప్రెసిడెంటుగా గెలిపించింది. ఆ రోజుల్లో అతడిని విపరీతంగా అభిమానించేది. కులాలు ఒకటి కావు కుదరదని తెల్సి కనక ఆశ మాత్రం పెట్టుకో లేదు. అవన్నీ శూర్పణఖకి గుర్తుకు వచ్చాయి.

చక్కగా ముస్తాబై ఆ మర్నాడు రామరాజు తోట కెళ్లింది. రామరాజు ముద్దెట్టుకొంటాడను కొని ముచ్చటపడి వెళ్తే రామరాజు :

"లచ్చుమయ్యా! పొద్దున్న నుంచి సాన పట్టిన కత్తి తీసుకొని ఈ ముండ ముక్కు చెవులు తెగ్గోయి" అన్నాడు తన మనస్సులో కుళ్లు వెళ్లబోసే నవ్వుతో.

"ఇదేం సరసం!" అంది శూర్పణఖ అది హాస్యం అనుకొని.





# శూర్పణఖ శోకం

"వస్తున్నా ! అన్నా !" అని లచ్చుమయ్య ౨బంగానే కత్తి తీసుకొని వచ్చాడు.

రామరాజు శూర్పణఖ పారిపోకుండా తలుపులు బిగించాడు. ఆ తోటలో పట్టపగలు శూర్పణఖ మీద అత్యాచారం జరిగిపోయింది.

"నీ మొహం మండిపోను ! భార్య ముండ మోసీను ! నేనేం అపకారం చేసాన్రా ముచ్చు ముండాకొడక ! నీకు శ్రాద్ధం పెట్టా" అని శోకిస్తూ శూర్పణఖ శాపనార్థాలు పెట్టింది.

"నీ అన్న నా భార్యను ఎత్తుకుపోయి నాకవమానం చేసాడు. నేను నీ ముక్కుచెవులు కోసి మీ అన్నకి బుద్ధి చెప్పాను. పో ! పోయి మీ అన్నతో చెప్పుకో ! మీ అన్న దగ్గర మొత్తుకో ! ఇది కేవలం ఆరంభమే అని అంతం కాదని ముందున్నది ముసళ్ల పండుగని చెప్పు" అని రామరాజు "దాన్ని వీధిలోకీడ్చిరా" అని లచ్చుమయ్యకి ఆజ్ఞాపించాడు. అనుచరుడా ఆజ్ఞని పాలించాడు.

శూర్పణఖ రావణ్రావింటికి వెళ్లింది. అతగాడు పది కంఠాలతో రౌద్రంగా అరిచి డాక్టర్ని పిలిచి చెల్లెలికి కట్లు కట్టించి సర్టిఫికేటు తీసుకొని పోలీసు కేసు పెట్టాడు. పోలీసులు రామరాజుని లాకప్పులో పెట్టారు. రామరాజు తమ్ముడు లాయర్ని పెట్టి కప్ప తీయించాడు. లంచాలిచ్చి సిఫార్సు చేయించి కేసులు కొట్టేయించాడు.

"ఈ పిల్లని చిన్నప్పటినుంచి చెవులుకొరికే అలవాటు, కొరికించుకొనే అలవాటు ఉంది. ఆ అలవాటువల్ల రామరాజు ఇంటినుంచి వెళ్లినకొద్ది సేపటికి చెవులు కొరికించుకొంది. కొరికినవాళ్లకి పెద్ద పళ్లుండటంతో చెవులు తెగాయి. రావణరావు కోర్టువారికిచ్చిన సర్టిఫికేటులో ఏముంది ? చెవులు తెగాయి అని ఉంది. అవి రామరాజు తెగ్గోయించాడనిలేదు. దానికి సాక్ష్యం లేదు. ఇకపోతే ముక్కు. ఈ పిల్ల ఇంగ్లీషు చదువు చదివింది, ఈమెకు పోకింగ్ నోస్ హబిట్ ఉంది. అడ్డమైనచోట ముక్కు పెట్టడంతో ముక్కు తెగుంటుంది. దాన్ని మా క్లయింట్ తెంపించాడని సాక్ష్యంలేదు. లచ్చుమయ్య కత్తికి రక్తం ఉండటం సర్ కమ్స్టాన్షియల్ ఎవిడెన్సు. రాజులిళ్లల్లో ఎన్నో కోళ్లు తెగుతాయి. ఆ రక్తం శూర్పణఖగారి రక్తం ఒకటేనని తేలలేదు" అని వాదించాడు.

ప్రత్యక్ష సాక్షులు లేని కారణంగా కేసు కొట్టేసారు కోర్టువారు.

కోర్టు బయట వికార రూపంతో, "మీ మగవాళ్ల పగలకి మేమెందుకు బలైపోవాల్రా మగవెధవల్లారా ! మా అన్న రామరాజు భార్యనెత్తుకుపోతే రామరాజు తిన్నగా వెళ్లి వాడి ముక్కు చెవులు తెగ్గోయచ్చుకదా ! దానికి ధైర్యం చాలక నా మీద పడ్డాడు. మా అన్న మరో మగాడు ! రామరాజుతో వ్యాపారంలో చాలలేక అతని భార్య నెత్తుకుపోయాడు. అదీ వాడి ప్రతాపం. హరిజనులు ఎదురు తిరిగితే వాళ్లనేమన్లేక వాళ్లు లేనప్పుడు వాళ్ల గూడెం మీదపడి వాళ్ల ఆడవాళ్లని చెరిచే మగధీరులు, పోలీసు వీరులు ఉన్న దేశం ఇది. పోలీసులొచ్చి దొంగ వెధవల్ని పట్టుకుపోతే, మిగిలిన దొంగ ముండాకొడుకులువచ్చి పట్టిచ్చిన మగవాళ్లని పట్టుకొన్న పోలీసులని వదిలిపెట్టి, ఊళ్లో ఆడవాళ్లని రేప్ చేసే రాజ్యం ఇది. ఎవరు ఎవరితో ఎకౌంట్ సెటిల్ చేసుకోవాలన్నా మేమే ఆడవాళ్లం దొరుకుతాం! పగలకి మేమే ఫలహారం అయిపోతాం ! మీరు మీరు తేల్చుకోరేం రా వెధవల్లారా! మీరు నాశనం అయిపోండ్రా ! దేవుడా ! ఈ మగవెధల ప్రమేయం లేకుండా మాకు పిల్లలు కలిగేలాగా, ఆ కలిగిన సంతానంలో మగపురుగులు లేకుండాను చెయ్యలేవా ! లేకనువ్వు మగాడివేనా !" అంటూ శూర్పణఖ హృదయాలు కరిగించేలాగా శోకించింది.

"అంతేనమ్మ మన ఆడజీవితాలు" అని ఓదార్చింది ఆమె వదిన, రావణరావు భార్య. ★

# ఇంద్రజాలం-గ్రేట్ ఎస్కేపిస్ట్ హౌడినీ

మేజిక్ పేరు చెప్పగానే చాలా మందికి స్ఫురించే పేర్లు రెండు. హ్యారీహౌడినీ, ప్రొఫెసర్ పి. సి. సర్కార్. ఇద్దరూ అంతర్జాతీయంగా ఖ్యాతి గడించిన ఇంద్రజాల నిపుణులే. హ్యారీహౌడినీ ఎన్నో కొత్త మేజిక్‌లు కనిపెట్టి మేజిక్ రంగంలో అత్యున్నతస్థాయికి చేరుకున్నారు. ఎంత బలమైన సంకెళ్ళు వేసినా, క్షణంలో వదిలించుకోవటం ఎలాంటి ఉక్కు పెట్టెలో పెట్టి బంధించినా, కనురెప్పపాటులో తప్పించుకురావటం లాంటి అత్యంత ఆశ్చర్యకరమైన మేజిక్‌లుచేసి ఆయనకు అతీతశక్తులున్నాయేమో అని భ్రమింపచేసేవాడు.



పోలీసుల పర్యవేక్షణలో గ్రేట్ ఎస్కేప్‌కి ఆయత్తమవుతున్న హౌడినీ

1874లో హంగరీలో జన్మించిన హౌడినీ అసలు పేరు ఎరిచ్ వీస్. అతి పేద కుటుంబంలో పుట్టడంవలన తాను చదువుకునే స్కూలులో ధనవంతుల బిడ్డలు తెచ్చుకున్న మిఠాయిలను, చాక్‌లెట్లను చూసి తాను పేదవాడిగా పుట్టినందుకు తనను తాను నిందించుకునేవాడు. కానీ జిహ్వను చంపుకోలేక ఆ పిల్లలులేని సమయాలలో అతిలాఘవంగా వారి పెట్టె తాళాలను తీసి వాటిలోని మిఠాయిలను దొంగిలించి తిరిగి తాళాలను వేసేసేవాడు. ఈ పనిని కేవలం ఒక చిన్న సూదితో చేయగలిగేవాడు. అలా మొదలుపెట్టిన ఆ ''పని''లో అచిరకాలంలో ఎంతో ప్రావీణ్యతపొంది ఎటువంటి దృఢమైన తాళాన్నయినా సునాయాసంగా తెరవగలిగే స్థితికి చేరుకున్నాడు. ఇది గమనించిన స్నేహితులు ఈ విద్యను వినోదంకొరకు ప్రదర్శిస్తే ఆర్థికంగా కూడా సహాయంగా ఉంటుందని సూచించారు. ఆ సలహాపై పట్టణంలో జరుగుతున్న సర్కస్ కంపెనీలో చేరి ప్రదర్శనలివ్వసాగాడు. అదే సమయంలో అక్కడ మేజిక్ ప్రదర్శనలిస్తున్న మెజీషియన్ని మంచి చేసుకుని అతని వద్ద అన్ని లాఘవాలనునేర్చుకుని అనతి కాలంలోనే గురువును మించిన శిష్యుడయ్యాడు. రాబర్ట్ హౌడిన్ అనే ప్రఖ్యాత మెజీషియన్‌ని ఆదర్శంగా పెట్టుకొని అతనంత ఖ్యాతి గడించాలని తన పేరును హౌడనీగా మార్చుకున్నారు.

పేదరికంతో కొన్ని సంవత్సరాలు బాధపడినా, ప్రాణాలకు తెగించి చేసిన కొన్ని బ్రహ్మాండమైన మేజిక్‌లవలన అతను అంతర్జాతీయ ఖ్యాతి పొందాడు. అతను చేసిన అంశాలలో ''గ్రేట్ ఎస్కేప్'' అనే మేజిక్‌ను ప్రజలు పత్రికలు ఎంతో ప్రశంచారు. తనను ఒక పెట్టెలో ఉంచి, సీలువేసి, నదిలో పడవేసిన తరువాత తిరిగి నది ఒడ్డున ప్రత్యక్షమవటం ఈ అంశంలోని ప్రత్యేకత. ఈ అంశాన్ని చాలాసార్లు చేసిన ఘనత కూడా ఆయనకే దక్కింది.

గ్రేట్ ఎస్కేప్‌తోపాటు, ఇనపసంకెళ్లతో బంధించి ఇనప్పెట్టెలో పెట్టి తాళాలు వేయగా తప్పించుకోవటం, రైలు పట్టాలమీద ఇనుప గొలుసులతో కట్టేసి, రైలు స్పీడుగా తీసుకురావటం, ఆ సమయంలో కనురెప్పపాటులో అతను తప్పించుకోవటం వంటి ప్రాణాంతకమైన మేజిక్‌లు ఎన్నో చేసి ''గ్రేట్ ఎస్కేపిస్ట్'' అనే బిరుదు తెచ్చుకున్నాడు. ఆ కాలంలో ఎవరైనా బంధించివున్న మనుషులు తప్పించుకుంటే, హౌడినీలాగ తప్పించుకున్నాడు అని అనుకునేవారు.

ఇన్ని అద్భుతమైన సాహసకృత్యాలు అవలీలగా చేయటం వలన కొంతమంది ప్రజలు హౌడినీకి అతీత శక్తులు, అతీంద్రియ శక్తులు ఉండి ఉండవచ్చునని, ఆ విషయం హౌడినీ ప్రకటించటల్లేదని అన్నారు. దానికి సమాధానంగా అతను ''నాకెటువంటి మంత్రాలు, తంత్రాలు రావు, శక్తులు అసలే లేవు, నాకున్నదల్లా ఏకాగ్రత, ఆత్మవిశ్వాసం మాత్రమే'' అన్నాడు.

1922లో న్యూయర్క్ నగరానికి ఒక మహామాంత్రికుడు వచ్చాడు. అతను చనిపోయిన వారి ఆత్మలచే మాట్లాడిస్తానని పెద్దఎత్తున ప్రచారం చేయించుకున్నాడు. చాలామంది ప్రజలు ఆయనను దర్శించి, చనిపోయిన తమ బంధువుల ఆత్మలతో మాట్లాడి ఎంతో తృప్తిగా అతనికి బాగా ముట్టజెప్పి నెలరోజులు తిరిగేసరికి అతనిని కోటీశ్వరుడిగా చేసేసారు. హౌడినీ మాత్రం ఇందులో ''గుట్టు'' ఉందని కనిపెట్టి, ఒకసారి తానే తన తాతతో మాట్లాడాలని ఆ వ్యక్తిని కోరాడు. ఎవరైతే ఆత్మతో మాట్లాడాలో వారి నొక్కరినే వెలుతురులేని ఒక గదిలోకి తీసుకువెళ్ళి అక్కడ వీరి చరిత్రను అంతా తెలుసుకుని, చనిపోయినవారికీ, వీరికి ఉన్న సంబంధం తెలుసుకుని, ఒక కొవ్వొత్తి వెలిగించి ఆత్మను ఆహ్వానిస్తాడు. కొంచెం సేపటికి మెల్లిగా మాటలు వినిపిస్తాయి. అవి ఎటువైపునుంచి వస్తున్నాయోకూడా తెలియదు, కానీ చెవిదగ్గర మాట్లాడినట్లుగా మెల్లిగా వినిపిస్తాయి. ఆ గదిలో వారిద్దరూ తప్ప మరొక వ్యక్తి ఉండడు. ఆత్మ వీరితో ఎంతో ఆప్యాయంగా కుటుంబ వివరాలు అడుగుతుంది. ఆర్థిక పరిస్థితి ఎలా ఉంది ? ఆరోగ్యాలు ఎలా ఉన్నాయి ? లాంటి విషయాలు అడిగి వారిని

## అద్భుత వ్యక్తులు

ఎంతో తృప్తిపరచి ఆనందబాష్పాలు రాల్చేలాగ చేస్తుంది. కొంతమంది ఆనందం పట్టలేక అక్కడ కుప్పకూలిన సంఘటనలు కూడా ఉన్నాయి.

హౌడినీ కలసి తాతగారి ఆత్మలతో మాట్లాడాలని కోరినపుడు గదిలోకి తీసుకువెళ్లి వివరాలు అడిగి, కొవ్వొత్తి వెలిగించాడు. కొంతసేపటికి ఆత్మ మాట్లాడటం ప్రారంభించింది. అంతే! మరుక్షణం హౌడినీ పులిలా లంఘించి అతని పీక పట్టుకున్నాడు. అంతే, ఆత్మ మాటలు ఆగిపోయాయి హౌడినీ కోపంతో ఊగిపోతూ అతని కాలర్ పట్టుకుని బయటకు లాక్కొచ్చి ''ఆత్మ'' రహస్యాన్ని బయట పెట్టాడు. మాట్లాడినది నిజంగా ఆత్మకాదు! మాంత్రికుడే పెదిమలు కదపకుండా మాట్లాడటం [వెంట్రిలాక్విజం — మాట్లాడే బొమ్మతో చేసే విద్య] బాగా ప్రాక్టీసు చేసాడు. అలా మాట్లాడుతుంటే దూరం నుంచి మాట్లాడినట్లుగా వినిపిస్తుంది. ఆ విద్యను ఈ రకంగా ప్రయోగించి అమాయకులైన ఎందరినో మోసం చేసాడు. హౌడినీ అతని రహస్యం బయట పెట్టాకా, ప్రజలు అతని ఇంటి మీద దాడి చేసి ధ్వంసం చేసారు.

ఇలాగ ఆత్మలతో మాట్లాడిస్తామని, పునర్జన్మ రహస్యాలు చెప్తామని ప్రజలను మోసం చేసే మాయ మనుషుల బండారాలు బయటపెట్టి హౌడినీ సమాజానికి ఎంతో సేవ చేసాడు. హౌడినీకి భయపడి ఈ రకంగా దగా చేస్తే వ్యక్తులు వృత్తి మానుకుని వేరే గౌరవప్రదమైన వృత్తులు తీసుకున్నారు.

ప్రజలకు వినోదం కలిగించడానికి మాత్రమే ఈ ఇంద్రజాలం చెయ్యాలని, దీనిని అతీత శక్తులతో ముడిపెట్టి ప్రదర్శించ వద్దని తన తోటి మెజీషియన్లందరినీ కోరాడు, ఎవరైనా తన మాట వినక దేవదూతలమనీ, మహామాంత్రికుల మని చెప్పి మేజిక్‌లు ప్రదర్శిస్తే మాత్రం తాను నిర్మొహమాటంగా వారి గుట్టు బయట పెట్టగలమని హెచ్చరించాడు. మేజిక్ నేర్చుకుంటామన్న వారందరికీ అతను నేర్పాడు. మేజిక్‌లు చేయకుండా ప్రతిభ ఉన్న, ప్రచారం చేసుకోకుండా ప్రవర్తన కలిగి ఉన్న యోగులు, ఋషుల జోలికి అతను పోలేదు.

తన మేజిక్ ప్రదర్శనలో కేవలం ''ఎస్కేప్''లే, కాకుండా మేకులు తినడం, బల్బులు తినటం, పావురాలను మాయం చేయటం, పేపర్లు చింపి అతికించడం, కళ్ళకు గంతలు కట్టుకుని పేపరు చదవటం, నీళ్ళను పువ్వులుగా చేయటం వంటివి కూడా ఉండేవి. ప్రతీ పదర్శనలోనూ ప్రేక్షకులకు ఒక చిన్న మేజిక్ రహస్యాన్ని చెప్పి వారికి మేజిక్‌మీద ఆసక్తి కలిగించేవాడు. అంతేకాదు పత్రికలలో చిన్న చిన్న మేజిక్‌లను రాసి ఎంతోమంది ఏకలవ్య శిష్యులను తయారు చేసుకున్నాడు. పత్రికలు కూడా అతనికి యధాశక్తిగా ప్రచారం ఇచ్చాయి. ఇది చూసి కడుపు మండిన కొందరు తోటి మెజీషియన్లు, అతనిని మేజిక్ సర్కిల్ నుంచి వెలివేసారు. అతను మేజిక్ రహస్యాలు అందరికీ చెప్పి ప్రచారం చేసుకుంటున్నాడనే నెపంతో. ఈ సంఘటనకు హౌడినీ బాధపడలేదు కానీ ప్రజలు మాత్రం ఎంతో ఆగ్రహం చెంది అతనిని వెలివేసిన మెజీషియన్ల ప్రదర్శనలు వెలివేసారు. ఈ విధంగా ప్రజల నుంచి ఇంతటి సహాయ సహకారాలు పొందిన మెజీషియన్ చరిత్రలో మరెవ్వరూ ఇంత వరకూ లేరు. ఇక ముందు ఉంటారేమో చెప్పలేను.

ఇంద్రజాలంలో తనకుతానే సాటి అనిపించుకున్న హౌడినీ 1926 అక్టోబరు 21న మరణించాడు. అతను చనిపోవటానికిముంద కొన్ని ముఖ్యమైన మేజిక్ రహస్యాలను ఒ పుస్తకంలో రాసి బ్యాంకులో భద్రపరిచాడ తాను మరణించిన వంద సంవత్సరాల తరువా ప్రపంచంలోని మెజీషియన్లకు ఇవి అందజేయ లని రాసాడు. 2026లో తెలియబోయే రహస్యాలను తెలుసుకునేవారిలో తొమ్మిదిమం భారతీయులుకూడా ఉన్నారు. వారిలో ఒకర మన ఆంధ్రులే !

[పైవారం : హిప్నటిజం— డాక్టర్ జేమ్స్ బ్రయిడ్]

# విజయాక్షతాశీస్సులు!

ఓ రాకేష్ !! ఓ వ్యోమవీరా !!
నీ కిదే భరతజాతి విప్లవాంజలి !!
ఓ రాకేష్ !! ఓ మల్హోత్రా !!
మీరు అనన్య వీరకిశోరాలు
మీ కిదే అరువదికోట్ల అప్తుల
కమనీయ కర్పూరంపు ఆరతి
కుమ్మరిస్తున్నాం గర్వంతో
కుంకుమ శోభిత విజయాక్షతలు
మేమంతా విజయాశీస్సులతో.
రాకేష్ !!
నీ సాహస వీర విహారం
నేలను నింగిని
వారధియై బంధించింది.
నీ అచంచల దీశక్తి
ఈ భూవిని ఆ భువనంతో
అపూర్వంగా సంధించింది.
నీ లద్వితీయ నిర్భీకత
గహనాంతర రోదసీలో
భరతాత్మను ప్రస్థావించింది,
భరతఖండమూ ఒక
అసామాన్య వసుంధరగా
అగ్రదేశాల సరసన
నిలువరించిన, ఓ ధీశాలీ !
నీ కివే మా శుభకామనలు !!
గగారిన్ కనిన కలను
కనువిందుగ పండించావు
రోదసీ పరిజ్ఞానంలో
మాతృభూమి ముందడుగిడిన
యశస్సును సాధించావు.

చంద్రుని గుట్టు రట్టు చేసిన
ఆర్మ్‌స్ట్రాంగ్ అన్నవై నీవు
భరత జనని సిగలో
అపూర్వ విజయసుమాన్ని
అద్భుతంగా అలంకరించావు.
భరతమాత విభవము
దిగంతముల నింపావు.
రోదసీ అజ్ఞాత రుచులు
సులభసాధ్యం చేసి
మాతృభూమి కల్యాణానికి
మానవజాతి ప్రగతికి
కొంగు బంగారాలు
సమర్పిస్తున్నావు, రాకేష్ !
సోదరుడు మల్హోత్రా
దిగాలుపడినాడేమో
తానూ పాలుపంచుకోలేక
పోయానని ఈ యశస్సులో.
వస్తుందని చెప్పు రాకేష్ !
త్వరలో ఓ సువర్ణ అవకాశం
ఈ సుదీర్ఘ పోరాటంలో
తనవంతు ఇంకా ఇంకా
క్రాంతి జ్వాలను
పృధివిని నింపేందుకు.
మానవ జాతి ప్రగతికి
మీ సాహసమో రాచబాట
మీరు మానవ మాణిక్యాలు
మీరు కీర్తి మూర్తి మంతాలు.

— పింగళి పాండురంగారావు

మంథా వెంకట రమణారావు సీరియల్

# ఉదయసంధ్య

(గత సంచిక తరువాయి)

"ఆ టిక్కెట్లు తీసుకొని ఇప్పుడే వచ్చేస్తాను."

రామం అన్నాడు శాంతమ్మతో. సరస్వతీ హాలు వీధి అవతలే ఉంది. పెరట్లోంచి వెళ్తే రెండు నిముషాలు పడుతుంది వేగం నడుస్తే. టిక్కెట్లు తేకపోతే సుబ్బారావుకి కోపం వస్తుంది. సుబ్బారావుకి కోపమొస్తే ఈ ఇంట్లో అందరికీ తనమీద కోపం వచ్చినట్టే. పెద్దకొడుకు ఇంటర్ ఫైనల్ చదువుతున్నాడు ... తరవాత యూనివర్సిటీలో బి. ఎల్. చదువుతాడు ... అసలు వాడికి ప్రాక్టీసు పెట్టకపోయినా బాధ లేదు. ఈ ఇల్లూ, భూములూ, డబ్బు వాళ్ల నాన్న ఆర్జించినది బోలెడు ఆస్తి ఉంది. సీతారామశాస్త్రి మంచి క్రిమినల్ లాయరు. ప్రాక్టీసు బాగా ఉంది. మంచి మేథావి. ఊళ్లోని లీడింగ్ లాయర్లలో ఈయన మొదటివాడు. అందుకతనికి ఊపిరి సలపని పని, ఎంగేజ్‌మెంట్లు. పిల్లల సంగతి చూసేందుకే టయిముండదు. ఇంటి సంగతంతా శాంతమ్మే చూసుకుంటుంది. కాని ఆవిడ పిల్లల్ని దండించడం కాని, అదుపులో పెట్టడం కాని ఎప్పుడూ చేసి ఎరుగదు. పిల్లల్ని ప్రేమించడం అంటే ఆవిడ ప్రకారం వాళ్లు అడిగినదల్లా ఇవ్వడం, వాళ్లు సంతోషంగా ఉండేటట్టు చూడడం. అందువల్ల ఈ ఇంటికి యజమానులు యజమానురాళ్లూ ఈ పిల్లలే.

"సరే ... వెళ్లి వేగం ఒచ్చీ ... నాకు సిన్ననల్లా ఉపవాసం... నీ భోజనం అయేక ఆయనకీ వడ్డించేస్తాను..." శాంతమ్మ అంది. పండు తమలపాకులాటి శరీరపు రంగు. శాంతమైన కళ్లు.

రామం మేడ మెట్లెక్కి మీదికి వెళ్లేడు సుబ్బారావు ఉంటున్న గదికి. ఆ గదిలో రేడియో సిలోన్ సంగీతం వినిపిస్తోంది. లత సోఫాలో కూర్చొని, వారపత్రిక తిరగవేస్తూ సంగీతం వింటోంది. పట్టుపరికిణీ, జాకెట్టు, దానిమీద లేతగులాబీ జార్జెట్ వోణీ వేసుకుంది. చేతులకి రెండు జతల బంగారు మురుగులు, వాటి మధ్య ఎర్రగాజులు, పరికిణీ రంగుకి మ్యాచ్ అవుతూ. లత అందమైన పిల్ల. తల్లి ఒంటి రంగు ... ఒత్తయిన పొడుగాటి జుత్తు... కోలముఖం ... తండ్రి యొక్క పెద్దకళ్లు, ముద్దు పెట్టుకోమని ఆహ్వానిస్తున్నట్టు కనిపించే ఒత్తయిన పెదవులు, ఇవి ఆమె ముఖ సౌందర్య లక్షణాలు. పొడుగాటి మెడ ఆర్టిస్టిక్‌గా ఉంటుంది. శరీరం ఎదుగుతోంది. పదిహేను దాటేయి. అయినా మనిషి ఆ వయసుకి పొడుగ్గానూ, నాజూకుగానూ కనిపిస్తుంది. రెండు జడలలోని ఒక జడ మెడమీంచి వచ్చి వక్షం మీద నాట్యమాడుతోంది, ఆమె పేజీలు తిప్పినప్పుడల్లా. రెండో జడ సోఫామీంచి వెళ్లి వెనుకకు పడుతోంది. నుదుట ఉన్న కుంకుమబొట్టు కాస్త చెదిరి ఉంది. దానిలో ఆమె అందం ఎక్కువవుతోంది. రామం కనిపించగానే లత ముఖం మళ్లా ముడుచుకుంది

"నువ్వా కాలి బేండేజ్ ఎప్పుడు విప్పుతావు.. నేను చూడలేకుండా ఉన్నాను..." లత అడిగింది.

"ఇంకో వారంలో విప్పి వచ్చన్నారు డాక్టర్ గారు," తప్పు చేసిన వాడిలా అన్నాడు రామం.

"ఎందుకు చూడలేవే లతా?" సుబ్బారావు ఒక సినిమాపత్రిక తిరగవేస్తూ అన్నాడు. సుబ్బారావు మంచంమీద దొర్లుతున్నాడు. ఇంకా స్నానం చెయ్యలేదు. లతలాటి రంగుకాదు ఒంటిది. మట్టిరంగు... కళ్లు చిన్నవి. కనుబొమ్మలు దట్టమైనవి. జుత్తు ఎంత వంచినా వంగకుండా లేస్తుంది ఏదుపంది వెంట్రుకలలా. దాన్ని స్వస్తిక్ 'కేస్టరాల్' వాసన నూనెతో నొక్కి పెడదామని ప్రయత్నిస్తూ విఫలం పొందుతాడు.

"నాకు ఎవరన్నా అలా కట్టుకుంటే కుష్టు రోగపువాడే గుర్తుకొస్తాడు..." ఒళ్లు వెలపరం వచ్చినట్టు కుంచించి అంది. ఇప్పుడామె పుస్తకం పక్కన పడేసింది. రామాన్ని ఎగాదిగా చూసి అడిగింది... "ఎస్సే రాసేవా ?"

"రాయలేదు .. ఇంకా టయిము దొరకలేదు ..."

"నీ జీవితంలో ఏంబిషన్ ఏమిటి ?"

అదీ, ఇంగ్లీషు ఎస్సే సబ్జక్టు. రాసి రేపు చూపించాలి. రామం ఇంకా ఆలోచించే లేదు. ఏమిటి తన జీవితంలో ఏంబిషను ? బి. ఏ పాసయి, బి. యిడీ చదివి స్కూలు మాష్టర వాలని ఉంది. కాని అది అయ్యేపని కాదు. ఇలా పాసవగానే అలా గుమస్తా ఉద్యోగం తనకోసం రెడీగా ఉంది ... సీతారామయ్యగారు తన దగ్గర మూడో గుమస్తాగా తీసుకుంటామని నాన్నగారికి మాట ఇచ్చేరు, అంటే గవర్నమెంటులో దొరక్కపోతే. కాబట్టి తన ఏంబిషను ఎలాగున్నా, విధి తన నుదుట రాసేసింది తన భావి. దేనికన్నా డబ్బు ముఖ్యం. అదిలేనిదీ ఈ ప్రపంచంలో ఎవరూ పైకి రాలేరు. అదుంటేనే తెలివితేటలూ, వంశం, గుణం అన్నీ రాణిస్తాయి.

"నీ ఏంబిషన్ ఏమిటే అక్కా?" అంటూ సావిత్రి ప్రక్కగదిలోంచి వచ్చింది. సావిత్రి గౌను తొడుక్కుంది. ఆమెకీ లతకీ శరీరపు రంగులోనూ, కనుముక్కు తీరులోనూ అట్టే బేధం లేదు. యవ్వనం, ప్రవేశించబోతున్నానని చెపుతోంది ఆమెకు. గౌను, ఉబుకుతున్న, వంపులుదేరుతున్న ఆమె శరీరానికి అందం చేకూరుస్తోంది. కాళ్ళ ముడుకుల పైకి, ఎక్కువ కుచ్చిళ్లతో ఉంది గౌను. తెల్లటి ఆమె కాళ్లు తొడల వరకూ కనిపిస్తున్నాయి. కాళ్లు అందంగా, సాఫుగా, కండలు తీరి ఉన్నాయి. పాదాలు, ఆమె వేసుకున్న ముఖుమల్ బెల్టుస్లిప్పర్లలో కలువపువ్వు రేకులలా ఉన్నాలు. సావిత్రి జుత్తు ఒత్తుగా ఉంది. 'పోనీటెయిల్' ముడివేసింది ఎర్రరిబ్బనుతో. గౌను రంగుకి మేచ్ అవుతోంది. అమ్మతోనే పొద్దున్న లేచి, స్నానం కూడా చేసి పుస్తకాలు పట్టుక కూర్చుంది, గ్రామరు ఎక్సర్‌సైజ్‌లు చెయ్యడానికి. అర్థం అవడంలేదవి.

"మీ ఆడవాళ్లందరి ఏంబిషనూ ఒకటే... పెళ్లి చేసుకొని వంటిల్లు చార్జీ తీసుకోవడం." సుబ్బారావన్నాడు.

"నాకు నాన్నగారిలా ప్లీడరు కావాలని ఉంది..." లత చెప్పింది.

"బ్రేవో !... బ్రేవో...!" అంటూ చంద్రం గదిలోకొచ్చేడు, చేతిలో అర్ధనగ్నంగా ఉన్న వాటర్ కలర్స్‌తో వేసిన ఒక పెయింటింగ్ పట్టుకొని... "నువ్వు లాయరువైతే రెండుచేతులాఆర్జిస్తావ్."

లత ముఖం వికసించింది చంద్రాన్ని చూసేసరికి. చంద్రం వేషం ఆర్టిస్టు వేషంలా ఉంది. కళ్లీ లాల్చీ, షెరాయీ, కాళ్లకి బాత్ రూమ్ స్లిప్పర్లు, సన్నపాటి పొడుగాటి విగ్రహం, కళ్లలోకి పడే ఉంగరాలజుత్తూ, కలలు కంటున్నట్టు కనుపించే కళ్ళు. ముఖంలోని అంగాలన్నీ, చెక్కి దిద్దినట్టున్నాయి. ఎత్తయిన ముక్కు,

**జరిగిన కథ — 1:** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు. దుర్గమ్మ కూతురు మీనాక్షి రామాన్ని ఆదరిస్తుంది. పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. ప్లీడరు సీతారామయ్యగారి మేనకోడలు నిర్మలకు రామం అంటే ఇష్టం.

చెవిదగ్గరనించి, గడ్డంవరకూ గీత గీసినట్టు కనిపించే దవడలు, పొడుగైన మెడ, గొంతు క్కాయతో. లత రంగే. చేతివ్రేళ్లకి గోరింట పెటుకున్నాడులా ఉంది కొసలు ఎర్రపడ్డాయి.

''ఎందువల్ల ?'' సుబ్బారావు మంచం మ్మీద కూర్చున్నాడు శ్రద్ధగా.

''ఆడ డాక్టర్లున్నారు కాని ఆడ లాయర్లు ఈ ఊళ్లో ఎక్కడున్నారు ? అదలా ఉండగా లత కేసు ఆర్గ్యూచేస్తే పాయింట్లున్నా లేక పోయినా జడ్జీ తీర్పు ఆమె పార్టీకి ఫేవరబుల్ గానే చెప్తాడు... సత్యభామ నరకాసురుణ్ణి ఎలా ఓడించింది ?''

''ఒరే దానికీ దీనికీ సంబంధం ఏమిట్రా నీ బొంద...'' సుబ్బారావు నవ్వేడు.

''ఉంది. సత్యభామ తన శక్తి వల్ల ఓడించ లేదు. ఆమె బాణం పట్టుకొనేసరికి ఆమె అందం రెండింతలయింది. కోపంగా చూసేసరికి అందం నాలుగింతలయింది. దాంతో నరకాసురుడు ఆ అందానికి సమ్మోహితుడై చూస్తూ ఉండి పోయేడు. అలాగే లత ఆర్గ్యూ చేస్తే కోర్టంతా ఆవిడగారు చెప్పేవన్నీ వేదవాక్కులని బుర్రలూపు తారు.''

లత ముఖం సంతోషంతో విప్పారించి... ''అయితే లాయరుగా పనికొస్తానంటావ్ ?''

''హాయిగా...! కాని నువ్వు బి. ఎల్. పాసవాలి... అప్పటివరకూ నీకు పెళ్లికాకుండా ఉంటే... ఈ మధ్యనే ఎవడో ఒక రావణాసురు డొచ్చి మండోదరిని చేపడతాడు.'' చంద్రం అన్నాడు.. ఆ మాటలన్నప్పుడు చంద్రం ముఖం మ్మీద నీడలు కదలాడేయి.

''నేను పెళ్లి చేసుకోను...'' లత అంది.

''అది నీ చేతిలో లేదు. పెద్దవాళ్ల చేతిలో ఉంది...'' సుబ్బారావు అడ్డుపడ్డాడు.

నిర్మల అడ్డొచ్చింది...''రామాన్ని నిలబెట్టే సేరు... టిక్కట్లు కావాలా ఒద్దా...?''

''కావాలి... పిక్చరు పాతదే... ఇది రెండో సారి రావడం... కాని చంద్రం మెర్లిన్ మన్రోని చూస్తానంటున్నాడు... వాడిదేవతావిడ... ఇప్పుడే ఒక బొమ్మకి రంగులువేసేడు... మన్రో బేదింగ్ డ్రెస్‌లో... కావలిస్తే చూడండి... వాడి చేతిలో ఉంది...'' సుబ్బారావు వర్సు తీసేడు.

''ఛీ ! సిగ్గు లేకపోతేసరి...అలాటి బొమ్మలు గీస్తున్నావని అమ్మకి చెప్పేనేరా అన్నయ్యా... నీ పనవుతుందిలే...'' నిర్మల అన్నని భయపెట్ట జూసింది.

''మీ అందరికీ ఏం తెలుసునే ఆర్ట్ అంటే ఏమిటో? మీకు అప్పడాలు వత్తడం, ఒడియాలు వేయించడం, వంకాయ ముద్దకొట్టడం... ఇదే ఆర్టనుకుంటారు...''

''నీ ఏంబిషను ఏమిటి రామం ?'' సావిత్రి అడిగింది, తననెవరూ గమనించలేదని.



రామంకి ఏం చెప్పడానికీ తోచలేదు. ఏం చెప్పినా వీళ్ళు ఆటపట్టిస్తారు... "ఎస్సెల్సీ రాసే ఏంబిషను స్కూల్ ఫైనల్ ప్యాసయి స్కూల్ మాష్టరవడం... నిజమైన ఏంబిషను ఏదీ లేదు..."

"ఎందుకు లేదు ? నువ్వు మనిషివికావా ? రాయికి కూడా ఉంటుంది ఏంబిషను. ఒకరాయి రోడ్లు వెయ్యడానికి ఉపయోగిస్తే, మరొక రాతిని దేవాలయంలో శిల్పాలు చెక్కడానికుపయోగిస్తారు ... రెండోరకం రాయిని అవాలను కుంటుంది రాయి ... నాకు గొప్ప చిత్రకారుణ్ణి కావాలని ఉంది... మన దేశంలో పేరున్న చిత్రకారులు వేళ్ళమీద లెఖ్ఖ పెట్టొచ్చు..." చంద్రం లత పక్కకొచ్చి అన్నాడు. లతకేసి కళ్లార్పకుండా చూస్తున్నాడు.

"ఈడబ్బు తీసుకవెళ్ళి రెండు కుర్చీటిక్కట్లు పట్టా చాలు..." రెండు రూపాయలు రాముని కిచ్చేడు సుబ్బారావు... మేటనీకి టిక్కట్లు తక్కువరేటు. కుర్చీ టిక్కట్టుతో బాల్కనీలో పోయి కూర్చోవచ్చు. "అయితే ఇంటర్‌నేషనల్ ఫేమ్ కొట్టేస్తానంటావు... నీ ఏంబిషనేమిటే సావిత్రీ ?"

అమ్మయ్య... ఎంతసేపటికి తనని గమనించేరూ. సావిత్రి గదిలోకొచ్చి మంచం మీద కూర్చుంది. వీళ్ళెవ్వళ్ళా చెప్పనిది చెప్పాలను కుంది. కాలుమీద కాలు వేసుకొని, చేతుల కానుకొని వెనక్కి చేరబడింది... అలా చేరబడగా ఆమె ఒళ్ళు విల్లులావంగింది. ఛాతీ ముందుకు వచ్చి అందాన్ని పెంచుకుంది. గొను ఇంకా మీదికి

---

ఇటీవల ఉస్మానియా యూనివర్శిటీ అంతర్ కళాశాలల నాటక పోటీలో 'రాజీనామా' నాటికకు లభించిన ఉత్తమ ప్రదర్శన బహూమతిని ఓ.యూ. ఇంజినీరింగ్ కళాశాల విద్యార్థి శ్రీ పి. రుక్మాంగదబాబు, శ్రీ పి. శ్రీరాం నుండి అందుకుంటున్నప్పటి చిత్రం. మధ్యలో ఉన్నవారు శ్రీ సి. అశోక్‌కుమార్.



వెళ్లింది... "నేను సినిమాల్లో చేరతాను.."

అందరూ ఫకాల్మనవ్వేరు..."ఎక్స్ట్రాగానా" సుబ్బారావడిగేడు...

"కాదు... హీరోయిన్‌గా... నాన్నగారు మద్రాసు వెళ్లినప్పుడు ఈసారి... స్టూడియో చూపించమంటాను... నాన్నారితో వెళ్తాను..."

"బాగుంది... నువ్వూ నా మెర్లిన్ మన్రో అంత నటివీ అవుతావు..." చంద్రం అన్నాడు..

సావిత్రి గ్రామరు సంగతి మరిచిపోయింది. ఆమె మనస్సు కలలలోకంలో తేలిపోతోంది. రామం అక్కడ్నించి కదిలేడు. నిర్మల అతని వెంట ఉంది... "నేనూ వస్తాను నీతో హాలు వరకూ" అంది నిర్మల... వద్దనలేదు రామం.

"వీళ్లకి పనీ పాటూ లేదు... రోజల్లా ఇలాగే కబుర్లు చెప్తూ కూర్చుంటారు... మేడ దిగరు... భోజనాలకి తప్ప." నిర్మల చెప్పుకు పోతోంది... నిర్మల అలా మాట్లాడుతూనే ఉంటుంది..."అమ్మకి రోజల్లా పని...తెల్లవారు జామున లేస్తుంది... వీళ్లకి కాఫీలు...టిఫిన్లు... స్కూళ్లకీ కాలేజీలకీ వెళ్లే వేళకి భోజనాలూ... మామయ్యకీ అతని క్లయింట్లకీ కాఫీలు... టీలు. సాయంత్రం మళ్లా అవే పనులు. రాత్రి పదకొండుకి పడుకుంటుంది. లతా, సావిత్రీ అస్సలు సాయం చెయ్యరు... నాకు తీరుబాటున్న పుడల్లా అమ్మకి సాయం చేస్తాను... అన్న చూడు... వాళ్లతో కలిసిపోయేడు... వాళ్లలానే మేడదిగడు... బొమ్మలుగీస్తూ కూర్చుంటాడు. వాళ్లకీ మనకీ ఒక్కటేనా రామం ? అమ్మ అన్న మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది... వాడు పరీక్షలు పాసయి, మామయ్య పలుకుబడిలో మంచి ఉద్యోగం సంపాదించొచ్చు... కాని వాడు సరిగా చదవడు.. పాడయిపోతున్నాడు..."

రామం ఆశ్చర్యపోయేడు... నరసమ్మలా నిర్మల మాట్లాడుతోంది. ఈ పన్నెండేళ్ల పిల్ల బుర్రలో ఎన్నో పెద్ద ఆలోచనలు. ఈ ఇంట్లో ఆమె స్థానం ఆమెకి తెలుసు -- చంద్రానికీ తెలుసు. కాని చంద్రం వాళ్ల నాన్నలానే బరువు బాధ్యతలు పట్టించుకోడు. విచారాన్ని తప్పించుకొని, సంతోషాన్ని కౌగలించుకుందామనే మనస్తత్వం. నిర్మలకేసి చూసేడు రామం. నిర్మల అందం అంతా మరుగుపడిపోయింది. చెవుల మీది నించి కాకుండా, పైనించి జుత్తు దువ్వుకొని గట్టిగా బిగించి జడ వేసుకుంటుంది. పరికిణీ, బాడీ చెక్కులవి, చేనేత బట్టలు. చేతులకి గాజు గాజులు, కాళ్లకి వెండి పట్టీలు. నుదుట శింగారుతో నల్లటి బొట్టు, చెవుల కొసలకు వ్రేలాడుతూ జుంకాలు. ముక్కుకి ఒక రింగు. తల కొక రుమాలు కడితే జిప్సీ పిల్లలా కనిపిస్తుంది. కాళ్లకి జోళ్లు వేసుకోదు... "అస్తమానం వాటిని విప్పుతూ తొడుగుతూ ఉండాలి" వెనక్కీ, ముందుకీ చూస్తూ, అందరినీ గమనిస్తూ, నడుస్తుంది నిర్మల.

హాలు ముందు పెద్ద 'క్యూ' ఉంది – "నాకియ్యి, నేను తీస్తాను" అంటూ డబ్బు తీసుకుంది. ఆడవాళ్ల క్యూ వేరు. ఎవ్వరూ లేరు. టిక్కట్లు వెంటనే దొరికిపోయేయి. "ఒక్కసారి ఈ సినిమాలోవి ఫొటోలు చూద్దాంరా" అని ఫోయర్‌లోకి వెళ్లింది నిర్మల. రామం ఆమె వెనకే వెళ్లేడు. నయాగరా జలపాతం, హోటలుగది కిటికీలోంచి కనిపిస్తూ– మెర్లిన్ మన్రో ఫొటోలు వివిధ ఘట్టాలలో. ఒక ముద్దుల సీను. ఫొటోలు చూసి ఉన్నాయి... "ఛీ ! వెధవ బొమ్మలు, వీళ్లిద్దరూ ఇందుకే పరుగెడుతున్నారు. ఇప్పట్నించీ ఇవేంపాడు బుద్ధులు !" నలభైఏళ్ల ముసల్దానిలా మాట్లాడుతోంది నిర్మల. ఆమె ముఖం ఎర్ర పడింది ఆ ఫొటో చూసేసరికి. ఆమె రామం కళ్లలోకి చూసింది ... "నువ్వేమంటావ్" అన్నట్టు.

"నయాగరా జలపాతం చాలా పెద్దది ... ఎంతో అందమైనది" రామం అన్నాడు.

"అయితే నువ్వూ చూడు సినీమా..." అర్థం అయినట్టు అంది.

"పద పోదాం ... శాంతమ్మగారికి కోపం వస్తుంది." రామం ఇంటి ముఖం పట్టేడు ... రామానికీ సినీమా చూడాలనిపించింది. కాని టయిమూ లేదు, డబ్బూలేదు.

"చూస్తావా ? టిక్కట్టు కొనీదా ?" నిర్మల అడిగింది.

"డబ్బులేదు, టయిమూలేదు" రామం ఆగి అన్నాడు.

"నా దగ్గర రూపాయుంది. ఇద్దరికీ సరిపోతుంది. బెంచీ తీస్తే కుర్చీలో కూర్చోవచ్చు ... నీ భోజనం అరగంటలో అయిపోతుంది ... ఏం చెయ్యాలి కనుక...ఏం ... తీసీదా ?" నిర్మల మెరిసే కళ్లతో అడిగింది.

"ఒద్దు ... ఇప్పుడేగా సినీమా మంచిది కాదన్నావ్ ?" వారాల అబ్బాయి, నిర్మలతో కూడా ఇంగ్లీషు సినీమా చూసేడని లతకి తెలియగానే తనని నిల్చోపెట్టి దుయ్యబడుతుంది. సూటిపోటీ మాటలతో మనస్సుగాయపరుస్తుంది. సుబ్బారావు అది సహించడు. చంద్రం చెల్లినీ, తననీ కలిపి తిడతాడు. "మీ అన్న చూస్తాడు మనల్ని...ఇద్దరికీ అవుతుంది..."

"పెళ్లి...అంతేగా ?..." నిర్మల రాముణ్ని చూసి నవ్వింది... "సావిత్రికి గ్రామరు చెప్తే మంచివాడివి... నాతో సినీమా చూస్తే చెడ్డవాడివి..." నిర్మల ఇంటి ముఖం పట్టింది ... "ఔను ... నువ్వన్నదీ నిజమే ... అన్నకి వాడి సంగతొచ్చేసరికి ఒకటీ... పైవాళ్ల సంగతొచ్చే సరికి మరొకటీ... నీ దమ్మూతీ ఎంతో బాగుం

టుంది రామం. పోనీ నాకు జాగ్రఫీ నోట్సు రాసి పెట్టవూ ?''

నిర్మల తనకోసం దాచుకున్న రూపాయి సినీమా చూపడానికి ఖర్చుపెడతాననడం, రామం మనసుని కదిలించింది. నిర్మల తన సోదంతా తనతో చెపుతుంది. వినేవాళ్లు కావాలి దానికి.

''అలాగే రాస్తానులే. నాకు టయిమొకటి దొరకడంలేదు... సెలెక్షను పరీక్షలొకటి దగ్గర కొచ్చేయి.''

''నీకేం... నువ్వు క్లాసుకి ఫస్టు. లెక్కల్లో నూటికి నూరు మార్కులూ నీవే... అందుకే లతకి ఉడుకుమోత్తనం. ఎస్సే రాయలేదు. నిన్నడగడానికి దానికి గిర్వం... అంత గర్వం పనికిరాదు బాబూ... సావిత్రి బాధలేదు... అదీ స్కూల్ ఫైనల్‌కి వెళ్తే టెక్కు చూపిస్తుంది. పేసయేక నువ్వు కాలేజిలో చేరతావా ?'' నిర్మల ఆగింది వీధి గోడ దగ్గర... ఇంట్లోకి వెళితే మరి కబుర్లు చెప్పకుందుకి ఆస్కారం ఉండదు రామంతో.

''చేరను... మీ మావయ్య దగ్గర గుమస్తాగా చేరతాను...'' రామం కూడా ఆగేడు.

''ఆ పని చెయ్యకు... ఈ ఇంట్లో అందరికీ అలుసయిపోతావ్. ఒక పని చెయ్యి... నేను మావయ్యతో మాట్లాడతాను... ఈ ఇంట్లో ఎన్నో గదులు ఖాళీగా ఉన్నాయి... ఒకదాన్లో ఉండు... ఇక్కడే తిను... ప్రతి ఇంటికీ వెళ్లి వారాలేమిటి ?.... ఏం మాట్లాడీదా ? అప్పుడు నువ్వు కాలేజిలో చేరొచ్చు... పోనీ అత్తతో మాట్లాడతాను...'' నిర్మల చాలా సిన్సియర్‌గా చెప్తోంది రామం కళ్లలోకి చూస్తూ. రామానికి నవ్వొచ్చింది. స్కూలు హెడ్‌మాష్టర్‌గారు ''నీకు స్కాలర్‌షిప్పు గురించి రికమెండ్ చేస్తాను'' అన్నట్టు చెప్తోంది.

''నువ్వేం చెప్పకు... నేను నీచేత చెప్పించే ననుకుంటారు... నీ మాట ఎవరూ వినరు...'' నిర్మలని చూస్తూ ఉంటే ఎంతో ధైర్యం వస్తోంది రామానికి. నిర్మలకి ప్రాబ్లమ్సు లేవు. సొల్యూషన్సు సెకెండ్లమీద కనిపిస్తాయి.

''నేనేం పిచ్చిదాన్ని కాను... అమ్మచేత చెప్పిస్తాను.''

''సరేలే... పరీక్ష పాసవనీ ముందు...''

''అంతవరకూ ఎందుకు ? ఇక్కడ కొచ్చీసేవంటే హాయిగా ఎల్క్ట్రిక్ దీపాలున్నాయి, చదువుకోవచ్చు. అక్కడా వెంకటేశ్వరులు చదువు అవనివ్వడు నీకు... కవిత్వం రాస్తాట్ట కదూ?'' గొంతు తగ్గించింది నిర్మల... ''లత మీద పద్యాలు రాస్తున్నాడుట...''

రామం ఆశ్చర్యపోయేడు... నిర్మల కెలా తెలుసు... ''నీకెలా తెలుసు ?''

''నిజమేనా ?... నాకు తెలీందేముందీ ఊళ్లో...'' కళ్లుమెరిసేయి. ''బావా...అన్నా...

# ఉదయ సంధ్య

లతా ఆ సంగతి మాట్లాడుకొని ఒకటే నవ్వడం... బావకి తెలిసిందా న్యూసు...''

''పద వెళ్దాం... ఆలస్యం అయింది...'' లోపలికి వెళ్లేడు రామం.

జామిచెట్టుకింద, రామం చెయ్యి పట్టుక ఆపింది నిర్మల... నాలుగువేపులా చూసి ఎవ్వరూ లేరని నిర్ధారణ చేసుకొని పెద్ద రహస్యం చెప్తున్నట్టు కళ్లు పెద్దవి చేసింది... ''ఆ వెంకటేశ్వరులు లతని ప్రేమిస్తున్నాడుట!!''

రామం నోట మాట రాలేదు... ముఖం పాలిపోయింది. ఇదేదో ప్రమాదానికి దారితీసేలా ఉంది. ఆ వెంకటేశ్వరులుగాడితో తను కలిసి ఉన్నాడని తనమీదికే రావొచ్చు హద్దుమీరుతే... అవును. వెంకటేశ్వరులు లత మీద కవిత్వం అల్లుతున్నాడు... అది తీసుకవెళ్లి లత

## మిమిక్రీ

దేశం వృక్షం కొమ్మల్లోంచి
వాగ్దాన గీతాలు పాడిపాడి
జనాన్ని
మైమరపించి
అధికారం చేజిక్కించుకుంటే
పాపం
కోకిలలే అనుకున్నారు — జనం.
తీరా
తెలిసింది
అన్నీ కాకులే అని !!!

— రామసూరి

కివ్వమన్నాడు కూడా... కవిత్వం ఎలా ఉందో కనుక్కోమని... వాడిని తప్పించుకోడం కష్టమౌతోంది. తనకన్నా రెండేళ్లు పెద్దవాడు... లతనే తప్ప మరొకర్ని పెళ్లాడడుట... నిర్మల అన్నట్టు ఆ ఇల్లు వదిలి ఇక్కడికే వచ్చేస్తే... నిర్మల మాట ఎవరు వింటారు...వెంకటేశ్వరులు ఏవేవో లత గురించి చెప్తాడు... ఒకటీ తనకి బుర్రకెక్కదు.

''ప్రేమిస్తున్నాడా ? అంటే ?'' అర్థం కానట్టు అడిగేడు రామం.

''అంటే... తెలీదా...?'' వెర్రివాడిని చూసినట్టు చూసి ఫక్కున నవ్వింది నిర్మల.

''ఎవరే ఆ నవ్వూ నిర్మలా ! రామం ఒచ్చేడా... ఇలా రమ్మను వేగం... స్నానం చెయ్యమను...'' నరసమ్మ కేకవేసింది.

''ఒస్తున్నానమ్మా...'' అని గట్టిగా కేక వేసి... మరోసారి గొంతు తగ్గించి అంది.

''ఇంకో సంగతి తెలుసా... అందుకే సినీమాకి పోదాం అన్నాను. ఎన్నో సంగతులున్నాయి చెప్పాల్సినవి... విను... విని వెళ్లు... అన్న... అంటే చంద్రం అన్నా...'' ఆగింది... చెప్పకో అన్నట్టు... రామం మాట్లాడలేదు... ఏం చెప్పబోతోందో మాత్రం గ్రహించేడు. ''చంద్రం అన్న కూడా... ప్రేమించేడు...'' నవ్వు ఆపుకుంటోంది.

''ఎవర్ని ?...'' అర్థం కానట్టు అన్నాడు.

''నిన్నూ... మొద్దూ...'' కిలకిలా నవ్వింది... ''లతని...''

రామం ఒక నిర్ణయానికి వచ్చేడు... నిర్మలచేత వాళ్ల అమ్మకి చెప్పించి... ఆవిడచేత లాయరుగారికి చెప్పించడంకన్న తనే శాంతమ్మ గారితో మాట్లాడడం మంచిదేమో. వెంకటేశ్వరులుతో చదువు సాగదు... ఇక్కడ ఉండడానికీ, చదువుకుందుకీ గది దొరుకుతే చాలు. భోజనానికి వారాలున్నాయి.

''నిర్మలా ! ఉండడానికీ, చదువుకీ గదుంటే నాకు చాలు... నా భోజనం సంగతి నేను చూసుకుంటాను... శాంతమ్మగారితో నేను మాట్లాడతాను ఇవాళ... ఏమిటంటావ్ ?''

నిర్మల సంతోషంతో ఉక్కిరిబిక్కిరయింది. తరవాత, రహస్యం చెప్తున్నట్టంది... ''నువ్వు మాట్లాడకు... లోకువయిపోతావు. నేనే అమ్మతో చెప్తానుగా... నాకు పాఠాలు బుర్రకెక్కడం లేదనీ... నువ్వంటే బోధపరచగలవనీ... నిన్నే వాళ్లడుగుతారు... వెంటనే ఒప్పకోకు... పూర్ణమ్మగారిని అడగమను...నువ్వొచ్చేస్తే కోపం రాదూ ? అందుకు...''

''అవును... అదీ సంగతే... ఎలాగయితే ? ఎందుకడుగుతారు వీళ్లు .. నా అవసరం ఏమిటి వీళ్లకి... నీకు పాఠాలు చెప్పాలంటే సరిపోతుందా ?...''

మళ్లా నిర్మల నవ్వింది... ''సావిత్రికి గ్రామరు చెప్పాలి... లతకి మంచి మార్కులు రావాలంటే నీతోకూడా చదవాలి... ఎన్నో ఉన్నాయి లాభాలు వాళ్లకి...''

పన్నెండేళ్లన్నా నిండని ఆ పిల్ల తెలివితేటలకి ఆశ్చర్యపోతూ నిలబడిపోయేడు రామం... ''నా గురించి నీ కెందుకింత శ్రమ ?'' అని అడిగేడు ఆఖరికి...

ఆ ప్రశ్నకి జవాబు చెప్పలేకపోయింది నిర్మల... తడుముకుంది... తడబడింది... ఆఖరికంది... ''నా నోట్సన్నీ రాసిపెడతావ్‌గా... అందుకు...''

ఆ జవాబు సరైనదిగా తోచలేదు రామానికి... తనని చూస్తే కొందరికి జాలి... కొందరికి చిన్నచూపు... జాలిపడేవాళ్లలోకి వస్తుంది నిర్మల...

[ఇంకా వుంది]

"తలనొప్పికోసం ఎన్నో
వాడి చూశాను...

# అయితే అత్యుత్తమంగా పనిచేసేది సారిడన్!"

ఒక్క బిళ్ల సారిడన్ వేసుకుంటే చాలు. మీ తలనొప్పి క్షణంలో వదిలి పోతుంది. కారణం, ఔషధ పరిశ్రమలో ప్రపంచ నేతలైన రోష్‌వారు పరిశోధించి రూపొందించిన అద్వితీయ ఔషధ సూత్రం సారిడన్‌లో ఉండడమే!

కనుక, ఈసారి మీకు తలనొప్పి వచ్చినప్పుడు గట్టి మందే వేసుకోండి. సారిడన్ తీసుకోండి.




# సారిడన్

ట్రేడ్‌మార్కు 'రోష్'

ఒక్కటి, నిజంగా పనిచేసేది.

RPL-1205



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో "ఈ తీర్పు ఇల్లాలిది"

"పరిస్థితులకు బానిసైన విలన్, పోలీసు అధికారి... తండ్రీ కొడుకులుగా మోహన్‌బాబు, లాయర్‌గా సుజాత నటిస్తున్నారు," అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. వెంకటామరాజు కథ సమకూర్చి సమర్పించే ఎ ఆర్ ఆర్. పిక్చర్స్ "ఈ తీర్పు ఇల్లాలిది" చిత్రంలో భానుప్రియ, సత్యనారాయణ, రాళ్ళపల్లి, త్యాగరాజు, మిక్కిలినేని, అనూరాధ వగైరా తారాగణం. గణేశ్ పాత్రో సంభాషణలు, దేవరాజ్ ఛాయ, రాజా – కోటి సంగీతం, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు, గూనా సహ దర్శకత్వం నిర్వహిస్తున్నారు. "మే 18కి విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు నిర్మాత కె. ఎల్. ఎస్ ఎస్. రామచంద్రరాజా.



## "కలలు కనే కళ్ళు" లో హోటల్ యజమాని హాహాకారాలు

తలకు తగిలిన దెబ్బలకు కట్లు కట్టించుకుని విజయ్ (చంద్రమోహన్) ఇంట్లోకి వచ్చాడు. అతన్ని చూసి హోటల్ యజమాని రాజన్ (నూతన్‌ప్రసాద్), రమ (రమాప్రభ) ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఒరేయ్! ఆ కట్లేంటిరా? ఆ రక్తం ఏమిట్రా?" అని అడిగింది విజయ్ అక్క రమ.

విజయ్ బావ రాజన్ "అడడడా యెన్నా సోంబేరి ప్రశ్న అది! బోండా విరిస్తే బంగాళా దుంప వచ్చిన మాదిరి బాడీ విరిగితే బ్లడ్డు వచ్చును గదా? ఊఁ. సినిమాలో మాదిరి ఎవరోతోనైన ఫైటింగ్ సేసితివా?" అడిగాడు.

"లేదు, బావా! కాలేజీలో రాధ అనే అమ్మాయిని ఒక రౌడీ అల్లరి చేస్తూంటే, నేను వెళ్ళి ఫైటింగ్ చేసి..."

"ఆ ఫైటింగ్‌లు, గియిటింగులు నీకెందుకురా? దూరంనుంచి రాళ్ళు విసిరెయ్యాలి. దగ్గరగా వస్తే కళ్ళల్లో కారం కొట్టాలి గాని," అంది రమ.

"కారం కొట్టేందుకు ఇదెన్నా ఉత్సవమా! సోంబేరి!" అంటూ రాజన్, విజయ్ వంక తిరిగి "అదిసరే బామ్మర్దీ! ఆ పిల్లకాయకీ, నీకూ యెన్నో కనెక్షన్లు? ఇడ్లీ, సాంబారు— ఫేమిలీ శైపు కనెక్షను. పూరీ, కూర— అదీ ఓ ఫేమిలీ శైపు కనెక్షను. పెసరట్టూ, ఉప్మా— యిదీ ఓ ఫేమిలీ శైపు కనెక్షను... ఏది?" అని ప్రశ్నించాడు.

"ఆ కనెక్షన్, గినెక్షన్‌ల సంగతి నాకు తెలీదు. ఆ అమ్మాయి మంచి అమ్మాయి. నాకు స్నేహితురాలు. అవసరం వచ్చినప్పుడు వివరాలు మీకు తెలియజేస్తాను," అంటూ విజయ్ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఏమండీ, వీడేదో ప్రేమ వ్యవహారంలో పడ్డట్టున్నాడు. నాలుగు తన్ని అదుపులో పెట్టండి," అంది రమ.

"అది దా సోంబేరి పని. పెనంమీద అట్టు

'నాయకులకు సవాల్'



కాలేంతవరకు ఆగి, అది మినపట్టా, పెసరట్టా అని చూసి, అప్పుడుదా మాట్లాడుదాం," అన్నాడు రాజన్.

"ఆపండి — ఆపండి! సాంబారూ, పెసరట్టుతోనే సరిపోయిందిగా నా సంసారమంతా!" ఏడ్పు ముఖం పెట్టి, వెళ్లిపోయింది రమ.

బాలు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వబాధ్యతలు వహించిన శ్రీ అన్నపూర్ణా మూవీస్ "కలలు కనే కళ్ళు" చిత్రంలో ప్రతాప్ పోతన్, సారథి, ప్రసాద్ బాబు, సాక్షి రంగారావు, కవిత, ముచ్చెర్ల అరుణ, ఝాన్సి, నిర్మల ఇతర పాత్రధారులు.



## తాతినేని ప్రసాద్ కొత్తచిత్రాలు

చిరంజీవితో ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్ "నాగు" చిత్రం మార్చి26న సెట్‌కు వెళ్ళింది. చిరంజీవి, రాధ జంటతో ఆవం గోపాలకృష్ణారెడ్డి నిర్మించే శ్రీ వెంకటకృష్ణా ఫిలిమ్స్ 'పులి' చిత్రానికి స్క్రిప్ట్‌వర్క్ జరుగుతోంది.

శ్రీ శాంతిచిత్ర పతాకంలో లక్ష్మణరావు, గోగినేని ప్రసాద్ నిర్మించే "రిక్షా రంగడు" చిత్రంలో; "కర్జ్" హిందీ చిత్రం ఆధారంగా మస్తాన్‌నాయుడు నిర్మించే చిత్రంలో బాలకృష్ణ హీరో.



జగపతి ఆర్ట్ పిక్చర్స్

# ఎస్.పి. భయంకర్

నిర్మాత-దర్శకుడు వి.బి.రాజేంద్రప్రసాద్

మాటలు-పాటలు: ఆచార్య ఆత్రేయ సంగీతం: కె.వి.మహదేవన్ కెమెరా: నవకాంత్



ఉషాకిరణ్ మూవీస్



# సుందరి సుబ్బారావు

నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
నరసింహారావు రేలంగి




Bhaskar

నిర్వహణ. మిక్కిలినేని జగదీష్‌బాబు



సుందరి — సుబ్బారావు"లో విజయశాంతి

## "సుందరి - సుబ్బారావు"లో సుందరమైన గాథ

పేరుకు తగ్గట్టు సుందరి అందమైన అమ్మాయి. ఆమె బస్సు దిగి కాలేజీకి వెళ్తొంటే, సుబ్బారావు ఆమె వెనుక బాడీగార్డులా నడవ సాగాడు. ఒకటికి రెండు తడవలు సుందరి వెనక్కి తిరిగి చూసింది కూడాను. సుబ్బారావు వెర్రి మొహం వేసుకుని నడుస్తున్నాడే తప్ప నోరువిప్పి ఒక్క అక్షరం కూడా పలకలేదు. అలా కాలేజ్ వరకు వెంబడించి గేటు దగ్గర ఆగిపోయాడు సుబ్బారావు. అది ఆడపిల్లల కాలేజ్ గనుక అంత వరకే అతని లిమిట్సు !

ఈ వరసంతా గమనించిన మాలతి అనే సుందరి ఫ్రెండు కథేమిటని సుందరిని అడిగింది —సిటీబస్సులో చిల్లర లేకపోతే తన టిక్కెట్టు అతనే తీసుకున్నాడని సుందరి చెప్పింది. చిల్లర డబ్బులిచ్చి చిల్లర వేషాలేసే ఈ వెధవల్ని చెప్పుతో కొట్టాలనే మార్కు రిమార్కు పాస్ చేసింది మాలతి. అంతటి మాట తట్టుకోలేక నోరు పారేసుకోవద్దని కోరింది సుందరి. "చూస్తూండు — కాలేజీ వదిలే వరకు గేటు దగ్గరే బీటు వేస్తాడు," అని ఛాలెంజ్ చేసింది మాలతి. అట్లా జరిగితే బావుండుననుకుంది సుందరి. కాలేజీ అయ్యాక ఆమె అనుకున్నట్టే జరిగింది. సుబ్బారావు గేటు దగ్గరే బీటు వేశాడు. సుందరి లోలోన సంతోషించింది. కాని, అతన్ని మాలతి నోటికొచ్చిన మాటలతో చీల్చి చెండాడేసింది — సుబ్బారావు బిక్కచచ్చిపోతూ, తను సుందరిని ఎందుకు వెంబడిస్తున్నాడో అసలు రహస్యం చెప్పేశాడు. విషయం తెలిసిన సుందరికి సుబ్బారావు మీద జాలి ఏర్పడింది. ఆ జాలి ఆ పైన ప్రేమగా మారింది.

రామోజీరావు నిర్మాతగా ఉషాకిరణ్ మూవీస్ పతాకంలో తయారయ్యే ద్వితీయ హాస్యప్రధాన చిత్రంలో సుందరిగా విజయశాంతి, సుబ్బారావుగా చంద్రమోహన్ నటించారు. రాజ్యలక్ష్మి, నూతన్‌ప్రసాద్, రమాప్రభ, లక్ష్మిచిత్ర, కాంతారావు, సాక్షిరంగారావు, వీరభద్రరావు, పి. జె. శర్మ ఇతర పాత్రధారులు.

## సినిమా

జి. వి. కృష్ణమూర్తి మూలకథకు ఆదివిష్ణు సంభాషణలకర్త. సత్యం సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, రేలంగి నరసింహారావు దర్శకత్వంలో మిక్కిలినేని జగదీష్‌బాబు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## రాజాచంద్ర దర్శకత్వంలో గుప్తా క్రియేషన్స్ చిత్రం

"రామదండు, పెళ్ళిచేసి చూపిస్తాం, మనిషికో చరిత్ర— వగైరా చిత్రాల కథకుడు 'విసు' ఓ ప్రత్యేక తరహా కథా చిత్రాలకు సిద్ధహస్తుడుగా తమిళనాడులో సుప్రసిద్ధుడు. ఆయనే రూపొందించిన ఓ తమిళ చిత్రం త్వరలో విడుదలవబోతోంది. ఈ కొత్త చిత్రం ఆధారంగా మా చిత్రాన్ని తయారు చేస్తున్నాం," అన్నారు సత్యం. ఈయన సమర్పించే గుప్తా క్రియేషన్స్ చిత్రానికి ఉగాదినాడు పాటల రికార్డింగ్‌తోపాటు షూటింగ్ కూడా ప్రారంభమైంది — "జూన్ 16 నుంచి జులై 20 వరకు పూర్తి ఔట్‌డోర్ షెడ్యూల్ మద్రాసు పరిసరాలలోనే జరుగుతుంది," అన్నారు నిర్మాత నారాయణగుప్త. సుమన్, విజయశాంతి, చంద్రమోహన్, పూర్ణిమ, గొల్లపూడి మారుతీరావు, శుభలేఖ సుధాకర్, నూతన్‌ప్రసాద్, రాజ్యలక్ష్మి, అన్నపూర్ణ, సూర్యకాంతం పాల్గొంటున్నారు. కాశీవిశ్వనాథ్ మాటలు, వేటూరి పాటలు, కృష్ణ—చక్ర సంగీతం, చెంగయ్య ఛాయ, కళాధర్ శిల్పం, కె. సత్యం కూర్పు, పి. మహేష్ కుమార్ సహకార దర్శకత్వంతో కె. తాతాజీ నిర్మాణ సారథి. రాజాచంద్ర దర్శకుడు.

'అరె ! నేను మ్యాట్నీ సినిమాకి బయలుదేరినట్టు ఎలా కనిపెట్టావురా ?'



కె.సి.ఎస్.చంద్రశేఖర్
సమర్పించు
వినయ్ మూవీస్

*PADMALAYA PUBS*

# ముఖ్యమంత్రి



స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**విజయనిర్మల**

నిర్మాత
**టి.శ్రీనివాసరెడ్డి**

సహనిర్మాత
శాఖమూరి సాంబశివరావు

చక్రవర్తి పుష్పాల గోపీకృష్ణ





## సహచర్యం అంటే...
## జతగా కలిసి
## పని చేయడం!



ఫోర్ హాన్స్ డబుల్
యాక్షన్ టూత్ బ్రష్
లాగా. పళ్లను శుభ్రం
చేయడం మరియు
చిగుళ్ల మాలిష్ జతగా
చేసే ఏకైక బ్రష్!

## ఫోర్‌హాన్స్
టూ-ఇన్-వన్ టూత్ బ్రష్




అడల్ట్ మరియు జూనియర్
సైజులలో లభ్యం.

324F 232 TL






నైజాం: గోపీకృష్ణ ఫిలింస్ • సీడెడ్: వీరబ్రహ్మేంద్ర కంబైన్స్






దర్శకత్వం:
ఎ.కోదండరామిరెడ్డి నిర్మాత: వి.కనకరాజు

లక్ష్మీఫిలింస్



# పరి పరి ప్రాంతాలలో ప్రశంసలందుకున్న కెయో-కార్పిన్ ఇప్పుడు శ్రేష్ఠతనాదరించే

# ఆంధ్ర ప్రదేశ్ కీ వచ్చింది!

పలచనిది,
మరక పడనిది,
బలకరమైనది...

నునుపుగా,
అంటుకోకుండా,
సున్నితమైన
సువాసనతో
కూడిన...




# కెయో-కార్పిన్

హేయిర్ ఆయిల్

డేస్ వారి శ్రేష్ఠమైన సమర్పణ 


PX/KK/TG-1/84A

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

జరిగిన కథ — 10 : కృష్ణారావుని పెళ్లి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది. అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్థ ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్లి చేసుకోమని బోధిస్తాడు. కృష్ణారావు తను తన అన్నగారి, వివేకానందుని, తండ్రిగారి అడుగుజాడల్లో నడుచుకోవాలనుకుంటునట్లు బాబాయి శ్రీహరిగారితో చెపుతాడు. సంసారం సాగిస్తూనే ఈ దీక్ష కొనసాగించవచ్చని నచ్చచెప్ప చూస్తారు శ్రీహరి బాబాయి. కృష్ణ గొప్పతనం ఆయన గుర్తించినా తులశమ్మగారి కోరిక తీర్చటం తన బాధ్యతగా తలచి కృష్ణను పెళ్లి చేసుకోమని కోరుతాడు. కృష్ణ తన లక్ష్యానికి సన్యాసమే మేలైనదని శ్రీహరి బాబాయితో చెపుతాడు. అందుకాయన సంసారం చేస్తూనే నిష్కామ బుద్ధితో మనసు నిశ్చలంగా ఉంచుకొంటే భగవంతునికి ఆత్మీయుడవ వచ్చని కృష్ణతో చెపుతారు. తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయ భారాన్ని తగ్గించు కొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్ర రావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావుతో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు. పద్మిని, కృష్ణప్రియల రాకతో తులశమ్మగారి ఇంట్లో చైతన్యం వస్తుంది. కృష్ణారావు చర్చలకు అందరూ ఆకర్షితు లవుతారు.

( గత సంచిక తరువాయి )

అలసటెరుగని చిరునవ్వులో వింత కాంతి మెరుస్తోంది. లోతెరుగని ఆ హృదయంలో సాగర గంభీర ఛాయలు గోచరిస్తున్నాయి. కృష్ణారావుతో చిన్నతనంలో ఆడుకున్న సత్యన్నారాయణ తన ప్రక్కనేవున్న మరో అతన్ని చూసి చిన్నగా కన్ను గీటాడు.

ఒకటి రెండుసార్లు ఈ హాలులోకి వచ్చి వున్నాడు. కృష్ణారావు గోష్ఠి విస్మయంగా విన్న అతనిలో అహం పడగ విప్పింది. తన వయసు వాడు. తనకన్నా తక్కువ చదివినవాడు. ఇంత గొప్పగా ప్రశంసింపబడటం సహించరానిదిగా వుంది. కేవలం అతని ఐశ్వర్యం వల్లే అందర్నీ తనవైపుకు తిప్పుకుంటున్నాడన్న అనుమానం కూడా లేకపోలేదు.

"కృష్ణా ! అవన్నీ వదిలేసెయ్యి. నాదొక సందేహం ... ఒకటికాదు. చాలావున్నాయి. అడగమంటావా ?"

ఎప్పటి చిరునవ్వే కృష్ణారావు పెదాలమీద మెరిసింది.

"అందరి సందేహాలూ తీర్చగలిగినంత గొప్పవాడివీ నారాయణా — నా కన్నా ఎక్కువ చదువుకున్నవాడివి. నీ కన్నా ఎక్కువ తెల్సని నేననుకోటంలేదు."

నారాయణ వక్రంగా నవ్వాడు.

"మరి ! ఈ గోష్ఠులకి అర్థం ? ఈ లైబ్రరీ మీ తాత పెట్టించాడు పోనీ కట్టించాడు. కాదనను. ఈ పుస్తకాలన్నీ అతనే కొని వుండచ్చు ..."

"తాతకాదు. తండ్రి ... !!!"

ప్రక్కతను చిన్నగా సవరించాడు.

"అతను లేనప్పుడు తండ్రైనా తాతైనా ఒకటేగా ... అదికాదు నా పాయింటు. వాళ్ళెవరో పదిమంది బాగుపడిపోతారని మంచి ఉద్దేశ్యంతోనే ఈ పని చేశారు. బాగానేవుంది. ఎందరో మహానుభావులు వ్రాసిన గ్రంథాలూ శాస్త్రాలూ — పుష్కలంగా కూడా వున్నాయి. వాటిని చదువుకోవాలనీ — మహనీయుల్ని గురించి తెల్సుకోవాలనీ — ఆశతో వచ్చే నాలాంటివారికి న్యాయం ఏం జరుగుతోంది ? ఈ గోష్ఠులూ సభలూ సమావేశాలూ — ఏకాగ్రతను భంగం చేస్తున్నాయి ...

ఈ పుస్తకాల్లో కన్పించే మహనీయులకన్నా ఎక్కువగా తెల్సినా ఇవన్నీ జరపటం ! కాలం విలువ గురించి మొన్నొకసారి చెప్పావే — నువ్వే విలువ తెలియకుండా ఖర్చు పెట్టటం ఏం బావుంది ? ..."

అతని మాటల్లో అక్కసు రాలుతోంది.

అతని కళ్ళల్లో ఈర్ష్య రగులుతోంది.

ఆరోగ్య ప్రదంలేని ఆవేశంతో అతని శరీరం అనవసరంగా కంపించిపోతోంది. తనను తనే కించపర్చుకుంటున్న అతన్ని పట్టించు కోవల్సిన అవసరం లేదన్పించింది అందరికీ. మంచిని విమర్శించే అతని వ్యక్తిత్వం బాగా తెల్సున్న చాలామందికి ఏహ్యభావం కలిగింది.

కృష్ణారావు పెదాలమీద చిరునవ్వు చెక్కు చెదరలేదు.

"లైబ్రరీకి ప్రతిరోజూ వస్తున్నావా నారాయణా ?"

"ఆ ! ఈ మధ్య దాదాపు రోజూ"

"రోజూ వచ్చి ఏం చదువుతున్నావు ?"

"దాదాపు అన్ని గ్రంధాలూ చదివాను. ముఖ్యంగా భగవద్గీతను కాచి వడబోశాను. అందులోని సారాన్నంతా మథించి మనసులో దాచుకున్నాను. అటువంటి గ్రంధాన్ని చదివాక— ఇటువంటిచోట్ల శుష్క సంభాషణలు వినాలంటే — మనస్సు అంగీకరించదు -- అందరికీ తెల్సిన విషయాలను—ఒక్కళ్లే తెల్సున్నట్టు బోధించ టం అందరూ గొర్రెల్లా తలలు ఊపటం ఏమంత మంచిది కాదని నా ఉద్దేశ్యం."

"ఇంకా..."

"పోనీ చర్చలు జరపదలచినప్పుడు అన్ని రంగాలలోనూ ప్రాముఖ్యం వహించిన వారితో రోజుకొక్కరు చొప్పున తేదీ, నెలకొక్కరి చేత ప్రసంగాలు ఇప్పించినా, గోష్ఠిని నిర్వహించినా ఉపయోగంగా వుంటుంది. ఎందరో మేధావు లున్నారు దేశంలో — అందర్నీ వదిలి, బావిలో కప్పలు సమావేశమైనట్టు మనమే సమావేశమై నట్టు మనమే సమావేశమై మన్లోమనమే చర్చలు జరుపుతున్నందువల్ల ఎవరికి ప్రయోజనం ? ఇందులో మహాపండితుడెవరున్నా రని ఇంత ఆర్భాటం ? కనీసం డిగ్రీ కూడా లేని..."

కృష్ణారావు వారించి వుండకపోతే నారాయణకి దేహశుద్ధి జరిగివుండేదే.



తన ప్రక్కన చోటిచ్చిన కృష్ణారావుని చిరాలున చూశాడు నారాయణ. అతని అర్థంలేని అహంకారం మీద అతిప్రశాంతమైన కృష్ణారావు చూపులు అనూహ్యంగా చావుదెబ్బ తీశాయి.

"నువ్వు అన్న దానిని కాదనను. అందులో నిజం లేకపోలేదు. నేనాట్టే చదువుకోనివాణ్ని. అందరికన్నా ఎంతో చిన్నవాణ్ని. ఎన్నో విషయాలను పెద్దలందరి దగ్గరా నేర్చుకోవాలని ఆరాట పడేవాడిని. అందుకే పెద్దలతో సన్నిహితత్వం అలవర్చుకున్నాను. గోష్ఠి లాంటిది జరిగితే — అదీ ఆధ్యాత్మిక అంశాల మీద కనుక— సమయం సద్వినియోగ మౌతుందని ఆశపడ్డాను. ఏకాగ్రత కుదరని వాళ్లూ— గ్రంధపఠనం మీద ఆశక్తిలేని వాళ్లూ, ఆధ్యాత్మక చింతన మీద విపరీతమైన అభిమానం వున్నవాళ్లూ—చర్చలలో పాలు పంచుకోటానికి ఇష్టపడ్డారు. క్రమ క్రమంగా సంఖ్య పెరిగింది. ఆసక్తి పెరిగిందనే అనుకుంటున్నాను గానీ నీ అంత లోతుగా ఆలోచించలేకపోయాను. నీలాంటి విద్యార్థికులు ఉత్సాహంగా ఈ గోష్ఠులలో ముఖ్య పాత్ర వహిస్తే తెలియని విషయాలను తెల్సుకోవాలని ఆత్రుతపడుతున్నాను—"

కృష్ణారావునే కళ్ళప్పగించి చూస్తున్నాడు నారాయణ. అతని కళ్ళల్లో కపటం లేదు. నిర్మలమైన అమాయకత్వమే వుంది.

అతని వదనంలో తుత్సితత్వంలేదు — కల్లాకపటంలేని వాత్సల్యమే వుంది.

తరచి తరచి చూస్తున్న నారాయణకి కృష్ణలో తానెరుగని అంశాలెన్నో మహోన్నతంగా కన్పించాయి.

ముందు వరసలోవున్న సోమయాజులు కళ్ళు వత్తుకుంటూ—మందలింపుగా నారాయణని కసిరాడు.

"డిగ్రీలుండగానే సరికాదు. వివేకం వుండాలి. కాలేజీ నేర్పే పాఠాలు ఉద్యోగాన్వేషణలో — నాలుగు రాళ్ళు సంపాదించుకోటానికీ— తన కుటుంబ సంరక్షణకీ ఉపయోగ పడతాయే గానీ — పక్కవాడికి చదువు ఏ విధంగానూ ఉపయోగపడదు. ప్రతిఫలాపేక్షలేక కేవలం మా కోరికమీద తన అమూల్య కాలాన్ని ఖర్చుపెడుతూ ఏదోరకంగా — దుర్వినియోగం చేస్తున్న ఈ కాలాన్ని — మాకోసం సద్వినియోగపరుస్తున్న కృష్ణని అర్థం చేసుకున్నవారు అనదగ్గ మాటలు కావివి. నోరు జారినంతమాత్రాన అతని కొచ్చిన నష్టం లేకపోగా నువ్వు కోల్పోయేది చాలావుంది. గీతను మథించానన్నావు. వెన్ను విరుచుకుని మరీ చెప్పావు. అన్ని గ్రంధాలనూ అవపోశన పట్టానన్నావు — మరి నీకీ అహంకారం ఎలా వచ్చింది? నిజమైన చదువు చదివినవాడికి అహంకారముండదే! నిజమైన జ్ఞాని కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలకి అతీతుడుగా వుంటాడే! అహంకారాన్నే చంపుకోలేనివాడివి ఎదుటివాడికి ఏ విషయంలో సహాయపడగలవు ? గీతను మథించినవాడు ఒక్క విషయాన్ని తెల్సుకోలేకపోవటం హాస్యాస్పదం — అపర ఆస్తికుడిలా కబుర్లు చెప్పే నీకు తెలీదా ? — భగవంతుడు దీనజన బాంధవుడనీ, అహంకారులైన పాపులు అతడ్ని చూడలేరనీ— అహంకారం వున్నంతవరకూ— అతని హృదయంలో భగవంతుడికి స్థానంలేదనీ — అటువంటి అహంకారిని మించిన నికృష్టుడూ — పాపీ మరొకడుండడని తెలీదా —"

తెల్లగా పాలిపోయి మొహాన్ని దించుకున్నాడు నారాయణ.

"నీకూ, కృష్ణకీ వ్యత్యాసం తెల్సిందా?— అన్నిటికీ అతీతుడై కూడా ఇంత చిన్నవయసులో జ్ఞాని అయివుండీ కూడా— శక్తికి మించి తన వాళ్ళకోసం పాటుపడుతూ కూడా— తనొక అజ్ఞానిననీ - తనకు తెల్సింది అత్యల్పమనీ చెప్పుకుంటున్నాడు. నీ విషయం తెల్సి కూడా— నిష్కల్మషంగా నీనుంచి వినగోరేదేదో వుందని అర్థిస్తున్నాడు. చూశావా మీ ఇద్దరికీ ఎంత తేడా వుందో—"

నారాయణ చూపులు దూరంగా కేంద్రీకృతమయాయి.

"కృష్ణ— వెళ్ళిపోతున్నాడు. నామీద కోపమొచ్చిందేమో...—"

నారాయణ చిన్నగా గొణుక్కున్నాడు.

సోమయాజులు తల పంకిస్తూ క్షణం వూరుకున్నాడు.

"కోపం కృష్ణకెప్పుడూ రాదు— అతను వెళ్ళిపోటానికి కారణం అది కాదు...—"

నారాయణ అయోమయంగా చూశాడు.

"చూశావా– చిన్నవాడైనా కృష్ణ దగ్గర నేర్చుకోవల్సింది ఎంత వుందో – తన పొగడ్తలు వినపడేచోట వుండకూడదని అతని నియమం. కారణం తెల్సా– ఎంత జితేంద్రియులకైనా– పొగడ్తలు అహంకారం కలిగిస్తాయి. అహంకారం భగవంతునికి దూరం చేస్తుంది. స్వగుణకీర్తనలు సాధువులకి ఎంత శత్రువులో స్వదోష కీర్తనలు అంత మంచి మిత్రులు. అతన్ని గురించి పూర్తిగా తెల్సుకుని మాట్లాడటం మంచిది,"

నారాయణ సిగ్గుతో తల దించుకున్నాడు.

* * *

కృష్ణారావు యధాలాపంగా గదిలోకి అడుగు పెట్టి తెల్లబోయాడు. అసలది తనుండే గదేనా అన్న అనుమానం వచ్చింది.

క్షణం పరికించి స్థబ్దుగా వుండిపోయాడు.

విషయం అర్థమై మొహం ఎఱ్ఱబడింది.

తన మంచం వుండే స్థానంలో– పెద్ద పందిరి పట్టెమంచం వుంది. మెత్తని దూది పరుపులమీద పాల తరకలాంటి దుప్పటి మెరుస్తోంది. ఒత్తుగా జాజులు జల్లిన మంచం చుట్టూ మల్లెదండలు బిగించివున్నాయి. అగరు ధూపంతో – ఫలహారాల పళ్ళాలతో గది అట్టహాసంగా వుంది.

"ఇందుకన్నమాట నన్ను రమ్మంది...–"

కృష్ణారావు గదినుంచి బైటకు రాకపోవటం చూసి ఎంతో మురిసిపోయింది తులశమ్మ.

## కర్మ యోగి

"ఎందుకక్కయ్యా–ఈ అలంకారాలన్నీ.."

నిర్లిప్తంగా అద్దంలోకి చూస్తూ అంది పద్మిని.

"కొత్త పెళ్ళికూతురివి కాదా? పరిస్థితులు ఇలా వుండబట్టిగానీ లేకపోతే– ఎంత వేడుకలు చేసుకునేవాళ్ళమో–"

చిన్నగా నిట్టూర్చింది పద్మిని.

"ఎందుకో... ఇటువంటివంటే – నాకంత ఇష్టంగా లేదు..."

"ఎందుకని ? –"

కృష్ణప్రియ చేతులోంచి మల్లెదండ తీసుకుంటూ చిన్నగా అడిగింది.

"ఏమో ! అమ్మ లేనప్పట్నుంచీ విరక్తిగా వుంది. ఆవిడ్ని వదిలి ఒక్క క్షణంకూడా వుండే వాళ్ళం కాదు... నీకు తెలియదక్కయ్య – అమ్మ ఎంత పిచ్చి అమ్మో నీకు తెలియదు. బ్రతికున్నన్నాళ్ళూ – నా పెళ్ళి కోసమే కలవరించింది. నా మెడలో పసుపుతాడు చూసింది. వెళ్ళిపోయింది. ఎందుకో – గృహిణిగా నన్ను నేను అద్దంలో చూసుకోలేకపోతున్నాను. అమ్మ కలలుగని కలవరించిన రూపాన్ని నేను... నేనే చూసుకునే సాహసం నాకు కలగటంలేదు. అక్కయ్యా ! – ఏమీ అనుకోనంటే ఒక్క విషయం చెపుతాను. అమ్మకి గుండెజబ్బని తెల్సు ఎక్కువ విషాదాన్నీ – ఎక్కువ సంతోషాన్నీ భరించలేదని కూడా తెల్సు. తెల్సే నేను పెళ్ళి చేసుకున్నాను. అంతకుమించిన సంతోషం అమ్మ కుండదని తెల్సు. అమ్మ భరించి బ్రతకలేదని కూడా తెల్సు. ఐనా – ఐనాకూడా నా స్వార్థం కోసం పెళ్ళి చేసుకున్నాను. అమ్మని దూరం చేసుకున్నాను... నా అంత దుర్మార్గురాలూ – దురదృష్టవంతురాలూ ప్రపంచంలో వుంటుందా అక్కయ్యా –"

అత్తగారు ఎక్కడ వస్తుందోనని హడావుడిగా దిక్కులు చూసింది లక్ష్మి. గాభరాగా కన్నీళ్ళు తుడిచింది.

"వూరుకో... వూరుకో – అత్తయ్య చూస్తే బాధపడతారు – మా కృష్ణ సంగతి నీకు తెలీదు. కన్నతల్లిని కూడా మరిపించగల శక్తి అతనికుంది. అందుకే నిశ్చింతగా వుండు. ఎదురు చెప్పకు – ఇంక మాట్లాడకు –"

చనువుగా తేవదీసింది పద్మినిని.

ఈ అలంకారంలో అక్కయ్యని చూసి చిత్తరువులా నిలబడిపోతోంది కృష్ణప్రియ.

"ప్రియా – చూడవే ఇదంతా...నీకిప్పుడు అమ్మ గుర్తుకు రావటంలేదూ –"

చటుక్కున మొహం తిప్పుకుంది కృష్ణప్రియ –

చెమ్మగిల్లిన కళ్ళను అక్కయ్యకి చూపటం ఇష్టంలేక.

"పదమ్మా – అత్తయ్య ఎదురుచూస్తుంటారు –"

పద్మినిని చూస్తూనే రెండు కళ్ళు చాలనట్లు – తన్మయత్వం కప్పింది తులశమ్మని. ఈ అందాల అపరంజి కొడుకు మనసును పూర్తిగా మార్చగలదన్న నమ్మకం కలిగింది. అసామాన్యమైన ఈ అందం – తన వంశాన్ని నిలబెడుతుందన్న ఆశ క్షణాలమీద వ్రేళ్ళు నాటుకుపోయింది.

కాళ్ళకు నమస్కరిస్తున్న కోడల్ని మనసారా ఆశీర్వదించింది.

"సుపుత్రప్రాప్తిరస్తు –"

* * *

తడబడుతూ అడుగుపెట్టిన పద్మిని గది అలంకారం చూస్తూనే అప్రతిభురాలై నిలబడిపోయింది. గాభరాగా దిక్కులు చూసింది– గది తలుపులు మూసుకోటం గమనించి నీళ్ళుకారిపోయింది.

కృష్ణారావు నిశ్చలంగా కూర్చుని వున్నాడు.

భావాతీతమైన అతని చూపులూ నిశ్చలంగా ఎటో చూస్తూ వున్నాయి. పాలనురుగుల్లాంటి దుస్తుల్లో పాలరాతి విగ్రహంలా—చెక్కుచెదరని సౌందర్యమూర్తిలా – ధ్యానంలో వున్న యోగీశ్వరుడిలా కన్పిస్తున్న కృష్ణారావు దృష్టి జరగబోయే కార్యం మీద లేదు. మత్తు కలిగించే అంతటి అలంకరణా– మనసును చెలింపజేసే ఆ వాతావరణం అతన్లో ఏ విధమైన సంచలనాన్నీ కలిగించటం లేదు.

చిరుగజ్జెల చప్పుడుతో చివ్వున చూశాడు.

ముగ్ధమోహనంగా అలంకరించుకున్న పద్మినిని క్షణం రెప్పవాల్చకుండా చూశాడు.

కొన్ని క్షణాలు కనుబొమ్మలు ముడిచి మౌనంగా వుండిపోయాడు.

"పాలు ..."

తడబడుతూ గ్లాసు అందించింది.

# కర్మయోగి

ఆ లేత చేతులు విపరీతంగా వణుకుతున్నాయి. గ్లాసు వేడికే కందిపోయినట్లున్న ఆ వ్రేళ్ళు గులాబిరేఖల్ని గుర్తుకు తెస్తున్నాయి.

"కూర్చో పద్మినీ –"

అంత సన్నిహితంగా అంత ఆప్యాయంగా పిలుస్తున్న తన పేరు తనకే సరికొత్తగా అన్పించింది.

ఈ ఇంటికి వచ్చి ఇంత కాలమైనా ఏనాడూ– కావాలని అతనికి ఎదురు వెళ్ళలేదు. అతనూ తనని పిల్చి మాట్లాడే ప్రయత్నమూ చెయ్యలేదు. అతను యోగిలా, తను విరాగిలా మిగిలిపోయారు. ఇంత త్వరలో – ఇటువంటి సంఘటన జరుగుతుందని గానీ, జరగగలదని గానీ ఊహించలేకపోయింది తను. తల్లిమరణం గొడ్డలి పెట్టైయింది. తగ్గిన జబ్బును తిరగపెట్టింది. ఈ విషయం తనకే తెల్సు. కృష్ణప్రియకే తెల్సు. అతి దుఃఖమూ, ఆవేశమూ తనని మళ్ళీ మళ్ళీ వ్యాధిగ్రస్తురాల్ని చేస్తున్నాయి. అందుకే తను గదివిడిచి అవసరముంటేనే గానీ ఏనాడూ బైటకురాలేదు. కృష్ణప్రియలా అందరితోనూ చనువును పెంచుకోలేకపోయింది. నలుగురిలోనూ అలవాటైన తను మామూలు మనిషౌతోంది. కనుకనే చెల్లిగా ఆత్మీయురాలిగా తన సుఖాన్ని కోరుకుంటోంది ..." తనకే అర్థంకాని ఆలోచన్లతో తలమున్కలౌతున్న పద్మిని తన ఉనికినే మర్చిపోయింది.

"కూర్చో పద్మినీ ..."

మరోసారి రెట్టిస్తుంటే తన ఉనికి అర్థమై సిగ్గుతో తలవాల్చుకుంది పద్మిని. స్టూలు జరుపుకుని బుద్ధిగా కూర్చున్న పద్మిని వంక వాత్సల్యంతో చూశాడు కృష్ణారావు.

తనతో వివాహం జరగటం – అప్పగింతలు కావటం అంతలో తల్లిని కోల్పోవటం—అండలేని







## సమదృష్టి

రేపటికి
కోటికి పడగెత్తాలని
ముడుపు కట్టాడొక దొర.
ఈ రాత్రే
ఆ కుంభస్థలం బద్దలుకొట్టాలని
మొక్కుకున్నాడొక దొంగ
ఇద్దరికీ
చెరో చిరునవ్వూ వరమిచ్చాడు
కొండమీద దేవర.

— ఎమ్వీయల్

పరిస్థితుల్లో చెల్లెలుతో ఈ నీడన జేరటం జరిగిందంతా, సినిమా రీలులా కళ్ళముందు తిరిగింది. పెళ్ళి పీటలమీద తనే సర్వస్వమన్న భావనతో – చూసిన ఆ చూపులు గుర్తుకు వచ్చాయి. తల్లిని కోల్పోయాక విరాగిలా శూన్యంలోకి చొచ్చుకుపోయే ఆ చూపులు వెన్నాడాయి. ఒకే ఇంట్లో వుండికూడా ఇంతవరకూ పద్మిని ఆలనా పాలనా పట్టించుకోలేదనీ – తాళి కట్టాడేగానీ – ఆపాయ్యంగా ఏనాడూ పలకరించివుండలేదనీ – కనీసం మానవత్వంతో – తోటి మనిషిగా యోగక్షేమాలు విచారించలేకపోయాననీ మొదటిసారిగా అన్పించి మనస్సు చివుక్కుమంది. తల్లికీ, తండ్రికీ దూరమై – మరో అండలేక – ముక్కు మొహం తెలియనివాళ్ళనే సర్వస్వమనుకుని వచ్చిన ఈ అమాయకురాల్ని ఏ విధంగా ఆదరించగలిగానా అని ఆత్మ పరిశీలన చేసుకున్నాడు. జీవితంలో తన పంథాను పూర్తిగా మార్చేసుకున్నాడు. కృష్ణ మందిరానికే అంకితమనుకున్న జీవితాన్ని – కృష్ణమయమైన ప్రతి జీవికీ అంకితం చేసుకుని చరితార్థతనందుకోవాలనుకున్నాడు. ప్రస్తుతం తనంతవరకే ఎదిగాడు. చరితార్థత సాధించాలనే స్వార్థాన్నికూడా జయించగల స్తోమత అందరానిదౌతుందేమో తెలియదు. తన ప్రస్తుత మానసిక స్థితికి పద్మినిని అలక్ష్యం చెయ్యటం ఉచితంగా తనకే అన్పించలేదు.

"ఇక్కడ అలవాటుపడ్డావా పద్మినీ !"

అనుకోని ఈ అభిమానం విస్మయాన్ని కలిగించింది.

"ఆఁ ... అత్తయ్యగారు అమ్మని మరపిస్తున్నారు. లక్ష్మి అక్కయ్య మా ఇద్దర్నీ స్వంత చెల్లెళ్ళకన్నా ఎక్కువగా చూసుకుంటున్నారు. మేమదృష్టవంతులం."

తృప్తిగా నిట్టూర్చాడు కృష్ణారావు.

"పోన్లే పద్మినీ – నేను అలక్ష్యంచేసినా – మీరు మనసులో పెట్టుకోలేదు..."

తను వింటున్నదీ చూస్తున్నదీ కలో – నిజమో అర్థంకాలేదు పద్మినికి. తను విన్నదాన్ని బట్టీ చూసినదాన్నిబట్టీ – కృష్ణారావు విరాగి విర్లిప్తుడు. బలవంతంమీద పెళ్ళికి అంగీకరించాడే గానీ – ముందునుంచీ వివాహానికి పూర్తిగా విముఖుడు. తండ్రీ అన్నగార్ల అడుగు జాడలలో నడుస్తాడనుకునే– ఈయన కట్టుకున్న భార్యతో ఇంత సౌమ్యంగా – ఆప్యాయంగా మాట్లాడు తున్నాడేమిటి ?"

ఆశ్చర్యంనుంచి తేరుకోలేకపోయింది పద్మిని.

పద్మినిని చూస్తూ విచిత్రంగా నవ్వు తున్నాడు కృష్ణారావు.

"భగవాన్ ! ఏమిటీ లీల? నా హృదయంలో ఎందుకు పీఠమేసుకున్నావు ? ఏం సాధించాలని నా జీవిత గమ్యాన్నే క్షణాలమీద మార్చివేశావు. ఏ మాసించి నన్నీ సంసార కూపంలో త్రోసి వేశావు. జీవితంలో వేసే ప్రతి అడుగూ నువ్వు నిర్దేసించిన పంథాలోనే నడుస్తోంది. ప్రతీ అంశం నువ్వు ఆజ్ఞాపించినట్లే జరుగుతోంది. ఏది జరిగినా – ఏది జరగకపోయినా – అది కేవలం నీ సంకల్పంవల్లే నన్న నమ్మకంతో ముందంజ వేస్తున్నాను. నీ సంకల్పం ఏద్దైనా శిరసావహిస్తాను –"

## కర్మయోగి

అతని హృదయంలో చిరుగంటలు మ్రోగి నట్టు పులకాంతితుడయాడు. వేణుగానం మ్రోగినట్టు తన్మయుడయాడు.

తనలోనే నెలవున్నాడమకున్న భగవంతుడూ– అన్నిటా, అందర్లోనూ నిండే వున్నాడన్న భావన ఎప్పటిలా పదే పదే గుర్తుకు రావటం మొదలు పెట్టింది.

అవును – నాకోసం నా తృప్తికోసం నేనెంతగా పాటుపడుతున్నానో – ఇతరులకోసం– ఇతరుల తృప్తికోసం – అంతకన్నా ఎక్కువగా పాటుపడాలి. పాటుపడతాను–మరోసారి ధృఢంగా అనుకున్న కృష్ణారావు మనసు తేలికపడింది.

"పాలు తీసుకో పద్మినీ –"

"ఉహూఁ... మీరు తీసుకోండి... మీకోసమే తెచ్చాను –" ఇంకేమనాలో తోచక ఖాళీ గ్లాసు బల్లమీద పెట్టాడు.

పద్మినికీ వాతావరణంలో ఊపిరాడటంలేదు.

ఆ పూలవాసనా – అగరుధూపం – కృష్ణారావు సన్నిధీ, ఉక్కిరి బిక్కిరి చేసే పరిసరాలూ పద్మిని లోని బలహీనతని వెలికి తియ్యటం మొదలు పెట్టాయి. కృష్ణారావు తనని సమీపిస్తున్నట్టూ, గాఢంగా హృదయానికి హత్తుకున్నట్టూ, ఎత్తుకుని మంచం దగ్గరకు తీసుకువెడుతున్నట్టూ– ఆ తరువాత దృశ్యాలు అస్పష్టంగా మనసులో మెదులుతుంటే–గుండెలు వేగంగా కొట్టుకుంటూ వొళ్లంతా చెమటలు పొయ్యటం మొదలు పెట్టటం, క్షణాల మీద వొళ్లంతా కట్టెలా బిగుసుకుపోతున్నట్టూ–కళ్ల ముందంతా అంధకారమే పేరుకున్నట్టూ భ్రమలో కొట్టుకుంటున్న పద్మిని తూలి ముందుకు పడబోయింది.

"పద్మినీ...ఏమిటిది?–ఏమైంది నీకు !!!"

పడబోతున్న పద్మినిని బలంగా పట్టుకున్న కృష్ణారావు చేతిలో తోటకూర కాడ జారి నట్టైంది. కాళ్ల ముందు కుప్పలా కూలిన పద్మినిని అతి ప్రయత్నం మీద ఎత్తుకుని మంచం మీద పడుకోపెట్టాడు. మెడదాకా దుప్పటి కప్పి చన్నీటితో మొహం తుడిచాడు – పద్మిని స్పృహలోకి రాలేదింకా.

'పాపం. దురదృష్టం ఇంకా వెన్నాడుతూనే వుంది. లేకపోతే ఏమిటీ జబ్బు.'

బాధగా గొణుక్కున్నాడు కృష్ణారావు.

"పెళ్లికూతురికి మూర్ఛల జబ్బుందనీ, దాంపత్యానికి పనికిరాదనీ – చిన్నప్పుడు తరచుగా వచ్చే జబ్బు – తల్లి పోయాక తిరగబెట్టిందనీ ఆవేశాన్నీ ఉద్రేకాన్నీ–శక్తికి మించిన ఆలోచన్లనీ ఏమాత్రం భరించలేదనీ !

వాళ్ల తరఫు వాళ్లు చెప్పినా అంతగా

పట్టించుకోలేదు తను. ముందే జాగ్రత్తలు తీసుకుంటే ఈ పరిస్థితి వచ్చుండేది కాదేమో– ఐనా ఇప్పుడూ తను దూరంగానే వున్నాడుగా – ఈ జబ్బు మళ్లీ ఎందుకిలా వచ్చినట్టు !'

పద్మిని స్పృహలోకి వచ్చేదాకా అలాగే కూర్చుండిపోయాడు కృష్ణారావు.

''కృష్ణా !–మంచినీళ్లు...''

ఎంతోసేపటికి నూతిలోంచి మాట్లాడినట్టు కీచుగా అడిగింది పద్మిని.

''చాలు...చాలు...''

గుటకలు మింగుతూ– కళ్లు మూసుకునే మొహాన్ని ప్రక్కకు తిప్పుకుంది పద్మిని.

''ఇంకాస్త...ఆఁ–అను–''

నీర్సంగా కళ్ళు తెరిచింది పద్మిని.

కృష్ణారావు మసగ్గా కన్పిస్తున్నాడు.

పరిసరాలనూ, పరిస్థితులనూ – అర్థం చేసుకున్న పద్మిని కంగారుగా లేవబోయింది.

''ఏమీ అనుకోవద్దు... నేను... నేను... అలవాటుగా కృష్ణప్రియ అనుకున్నా... అందుకే అలా పిలిచాను...''

''పర్వాలేదు... అర్థం చేసుకున్నాను... ఇప్పుడు వొంట్లో ఎలా వుంది ?'' కృష్ణారావు ఆప్యాయతకి పద్మిని కళ్ళు చెమ్మగిల్లాయి.

''మీకు అన్యాయం జరిగింది...''

ఎంత నిగ్రహించినా దుఃఖం ఆగలేదు.

''ఛ... ఏమిటిది ?... నాకు అన్యాయం జరగట మేమిటి ?''

అనునయిస్తున్న భర్తను చూడలేక రెండు చేతుల్తో మొహాన్ని దాచుకుంది పద్మిని.

ఎలా వోదార్చాలో– ఏమని ఓదార్చాలో తెలియటం లేదు కృష్ణారావుకి. విషయం అర్థమయీ– అవకా– అగమ్యంగా వుంది.

''అవును. అన్యాయమే జరిగింది. నా ఆరోగ్యం విషయం మీకు పూర్తిగా తెలీదు. ఈ మధ్యదాకా ఇంట్లో ఎవరికీ అంత బాగా తెలియదు... ఇంటి పరిస్థితులు మీకు తెల్సను కుంటాను... మానసికంగా కృంగిపోయి కేవలం జీవచ్ఛవాలుగా బ్రతికాం. కృష్ణ ఎటువంటి పరిస్థితుల్నైనా తట్టుకోగలది. మంచిఆరోగ్యం, గుండె నిబ్బరం వున్నది. ఇంట్లో అదుండటం వల్లే నేనూ, అమ్మా, ఇంతమాత్రంగానైనా వుండగలిగాం...''

అలసటగావున్న పద్మినిని వారించబోయాడు కృష్ణారావు.

''దయచేసి చెప్పనివ్వండి. పెళ్ళికి ముందరే నా ఆరోగ్యం మంచిది కాదనీ మీకు నేను తగననీ చెప్పాలన్పించింది. కానీ– అమ్మ మొహం చూసి చెప్పలేకపోయాను. పిచ్చి అమ్మ నాకింత గొప్ప సంబంధం వచ్చిందన్న సంతోషంతోనూ, ఎవరైనా గిట్టనివాళ్ళు చెడగొడతారేమోనన్న భయంతోనూ సతమతమైపోతుంటే– ఆవిడ సంతోషాన్ని చేతులారా నాశనం చెయ్యలేక పోయాను. ఈ పరిస్థితుల్లో విధి మమ్మల్ని ఇక్కడికి జేర్చింది. నేను దిగులుగా వున్నాననో, సరదాగా మాట్లాడే స్థితిలో లేననో, కోలుకో టానికి సమయం పడుతుందనో– కృష్ణ కూడా ఇన్నాళ్ళూ నా జబ్బును దాచి వుంచింది... దాని ఉద్దేశ్యం మిమ్మల్ని మోసం చెయ్యాలని కాదు... నన్ను నమ్మండి. తెలిసో తెలియకో– మనమధ్య అనుబంధం ముడిపడిపోయింది. కేవలం పరిస్థితులకు లొంగే మనం దంపతులం అయాం. నా నుంచి అత్తయ్యావాళ్ళు ఎంతో ఆశిస్తున్నారు. మీరు ఆశించకపోయినా కనీసం మీ మనసులో ఏముందో. తెలియకపోయినా– ప్రస్తుతం మిమ్మల్ని బాధ పెట్టకుండా వుండటమే నేను చెయ్యగల మహోపకారం అనుకున్నాను. కృష్ణ అలాగే అనుకుంది. అందుకే కాలానికున్న శక్తిని పరీక్షిస్తూ– నా జబ్బు దాచి వుంచింది. చిన్నపిల్ల దాన్ని క్షమిస్తారని ఆశపడుతున్నాను.''

(ఇంకా వుంది)

# ఇవేమన పద్యాలు

బాబోయ్!... ఇతనికి బొడ్డు లేదు!

పుట్టినపుడు భువిలో బొడ్డు గోయమటంచు
అపుడె గురువుముద్ర అనతిచ్చె
ముద్రలేని నరులు మజ్జగంబున లేరు
విశ్వదాభిరామ వినుర వేమ.

**లాభాలు ఏమయినా ఉంటే అవి నష్టాలుగా మారగలవు!**

రోజూ మీరాకు సుపరిచితమయిన వార్తాపత్రికని చదువుతూ ఉంటారు.

వార్తలు, వ్యాఖ్యలు, వినోదం— అంతా ఒక కప్పు కాఫీకన్నా చవుకగా అందిస్తుంది ప్రతి దినమూ మీ పత్రిక.

మీరా వార్తాపత్రిక ద్వారా ప్రపంచమే మీ ముందు ఉంటుంది.

కాని, వార్తాపత్రికల ప్రపంచం కష్టాలలో ఉందని మీరాకు తెలుసా? ఒక వేళ తెలియక పోతే తెలుసుకోవాలని మా అభిప్రాయం.

## వార్తాపత్రికల మెడలకి ఉచ్చులు

వార్తాపత్రికల ఉనికికే ముప్పుతెచ్చే పన్నులు, సుంకాలని గురించి మీరాకు తెలుసా?

న్యూస్‌ప్రింట్ మీద 15 శాతం సుంకం ముందు వేశారు. దాన్ని టన్నుకి రు. 825 గా మార్చారు. ఒక వార్తాపత్రిక ఉత్పత్తి ఖర్చులో 50 శాతం న్యూస్‌ప్రింట్‌కే అవుతుంది.

ఇక దిగుమతి అయిన యంత్రపరికరాల మీద, ఇతర వస్తువుల మీద 40 నుంచి 150 శాతం దాకా సుంకం వేశారు.

1983 బడ్జెట్‌లో ప్రకటనల వ్యయం మీద 20 శాతం ఒప్పుకోమన్నారు. అంటే ప్రకటనదారుల ఖర్చు మీద 20 శాతం వ్యయంగా అంగీకరించకుండా దానిని లాభాలలో కలుపుతారన్నమాట. దీనితో ప్రకటనలు తగ్గిపోతున్నాయి. ప్రకటనలు 'దండగ' అనీ 'అవసరం కాదు' అనీ ప్రభుత్వం వారి అభిప్రాయం.

ఇదంతా ఎక్కడికి దారి తీస్తోంది?

పత్రికలు తమ అమ్మకం ధరలని పెంచుతాయి. పెంచటం వల్ల అమ్మకాలు తగ్గుతాయి.

అమ్మకాలు తగ్గితే ప్రకటనలు తగ్గుతాయి. అందుచేత మళ్ళీ అమ్మకం ధరలు పెరగాలి.

ఇది నిరంతరంగా జరిగితే చివరికి ఒక వార్తాపత్రిక ధర మరీ అధికం అయిపోయి, కొనే వారికి అది "అందుబాటులో లేదు" అనిపించి నిజంగానే వినియోగదారుకి అందుబాటులో లేకుండా పోతుంది.

ఇంత జరిగితే అది చాలా తక్కువ రాబడి కోసం ప్రభుత్వం అనుసరించే విధానాల ఫలితంగానే జరుగుతుంది.

## సమాచార ప్రసారానికి అవరోధాలు

1980 తరువాత దేశంలో పత్రికల అమ్మకాలు ఎలాగ ఉన్నాయో ఈ కింది అంకెలు తెలుపుతాయి. అవి తగ్గుముఖం పడుతున్నాయని మీరాకే తెలియగలదు.

| | | |
|---|---|---|
| 1977 | — | 37,427,000 |
| 1978 | — | 40,850,000 |
| 1979 | — | 46,449,000 |
| 1980 | — | 50,921,000 |
| 1981 | — | 51,102,000 |
| 1982 | — | 50,094,000 |

1981 కన్నా 1982 అంకె తక్కువ!

వర్ధమాన దేశంలో 1000 మంది జనానికి కనీసం 100 కాపీల వార్తాపత్రికలు అమ్ముడు పోవాలని ఐ.రా.స. వారు నిర్ణయిస్తే భారతదేశంలో ఈ అంకె 13!

అక్షరజ్ఞానం అందరికీ వుండాలనీ, సమాచారం ధారాళంగా ప్రసారం కావాలనీ ప్రభుత్వం వారు అంగీకరించి ఆ విధానానికి కట్టుబడి ఉంటామంటూనే ఇలాగ చేస్తున్నారు.

## ఆలోచించండి

గిట్టుబాటు కావటానికి ఒక వార్తాపత్రిక ఎన్నిసార్లు ధర పెంచాలి? ఇలాగ పెంచుతూ ఉంటే అది ఇంకా ఎందరికి అందుబాటులో ఉంటుంది?

ప్రకటనలు "దండగా"? అవి "అవసరమయినవి కావా"?

లేక పోతే వార్తాపత్రికలు సరసమయిన ధరలకి జనానికి అందుబాటులో లేకుండా చేసే విధానాలకే ఆ వర్ణనలు వర్తిస్తాయేమో!

ఈ ప్రశ్నలని గురించి ఆలోచించండి! అవి చాలా ముఖ్యమయిన విషయాలకి సంబంధించినవి.

**మీకు తెలుసుకునే హక్కు వుంది!**

**మాకు తెలిపే హక్కు ఉంది!**

**వార్తాపత్రిక అక్కరకివచ్చే మిత్రుడు అనుకోండి!**

**ఇండియన్ ఎండ్ ఈస్టర్న్ న్యూస్ పేపర్ సొసయిటీవారిచేత ప్రకటితము.**

# ప్రెస్టీజ్ ఒక్కటే 100% భద్రమైనది

# జి. ఆర్. ఎస్. ఒక్క ప్రెస్టీజ్‌కే కలదు గనుక









**జి. ఆర్. ఎస్. లేకుంటే ఏమౌతుంది?**

నకిలీ సేఫ్టీ ప్లగ్‌లు పనిచేయకపోవచ్చు. వెయిట్ వాల్వ్‌లోని రంధ్రాలు పూడుకుపోవచ్చు. ఒకవేళ ఆవిరి ఒత్తిడి ఎక్కువైపోతే, తక్షణం దానిని విడుదల చేయగల, వైఫల్యంలేని భద్రతా విధానం మీకు కావాలి. అందుకే జి.ఆర్.ఎస్. రూపొందించ బడింది ...మీ ప్రెషర్ కుక్కర్‌ను భద్రమైనదిగానే కాదు, అత్యంత భద్రమైనది గానే కాదు, 100% భద్రత కలదానిగా చేసేందుకు.




**ప్రెస్టీజ్‌కి జి.ఆర్.ఎస్. 100% భద్రతను ఎట్లా చేకూరుస్తుంది?**

గాస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక అద్వితీయమైన భద్రతా సాధనం. అది మూతలో రబ్బర్ గాస్కెట్‌కు సరిగా పైనగల ఒక రంధ్రం. ఆవిరి ఒత్తిడి అధికమైనప్పుడు జి. ఆర్. ఎస్. రబ్బర్ గాస్కెట్‌ను సాగేటట్టు, రంధ్రంనుంచి బయటకు విస్తరించేటట్టు చేసి, ఆవిరిని క్రిందివైపునకు విడుదలచేస్తుంది. అంత తేలిక. అంత సులభం. 100% భద్రత.



**అయితే అన్ని ప్రెషర్ కుక్కర్లు భద్రమైనవి కావా?**

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చినపుడు మీకు నకిలీది లభించవచ్చు. ఇది అత్యవసర సమయాలలో పనిచేయదు. దురదృష్టవశాత్తు సేఫ్టీప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు. ప్రమాదాన్ని ఎందుకు కొని తెచ్చుకోవాలి? జి.ఆర్.ఎస్. ఎన్నడూ విఫలంకాదు. అది 100% భద్రతను నిశ్చయంగా ఇస్తుంది.




**సొమ్ము ఆదా, మన్నిక మరియు సర్వీస్– ప్రెస్టీజ్ విధానం!**

ఎక్కువ వండడానికి స్థలాన్ని సమకూర్చి, సమయాన్ని, ఇంధనాన్ని ఆదా చేయడంలో మీకు తోడ్పడడానికి అనువుగా క్రొత్త ప్రెస్టీజ్‌కి ప్రత్యేకంగా అమర్చబడిన పైమూత కలదు. హెవీగేజ్ అల్యూమినియంతో నిర్మించబడిన క్రొత్త ప్రెస్టీజ్ పెక్కు సంవత్సరాలపాటు పనిచేస్తుంది. కాగా, దేశమంతటా నెలకొల్పబడిన ప్రెస్టీజ్‌వారి విక్రయానంతర సర్వీసు కేంద్రాల ఫలితంగా సమర్థమైన సర్వీసు లభించగలదని మీరు దృఢిగా నమ్మవచ్చు.

# క్రొత్త ప్రెస్టీజ్

ప్రతి కుటుంబానికి కావలసిన సైజులలో లభ్యమౌతుంది.

TTK తయారీ.

MAA(S) TTP 1B TEL 84



# చీకటిలో వెలుగు రేఖ

— జిలాని

"పది గంటలు అయింది ఇకనయినా లేరా స్నానానికి'' వసుంధరమ్మ పిలుపు తన కొడుకును ఉద్దేశించి.

ఎం. కామ్ చదివాడు ప్రకాష్. ప్రస్తుతం నిరుద్యోగి. పదహారు నెలల నుంచి అతడు పెట్టని అప్లికేషన్, రాయని పరీక్ష, చేయని ఇంటర్వ్యూ అంటూ లేదు. రోజూ అతనిని ఏదో విధంగా నిందిస్తూ ఉండటం అలవాటయింది ఆ ఇంట్లో. అభిమానవంతుడు అయిన ప్రకాష్ మొదట్లో ఆవేశపడేవాడు. కాని,ఇప్పుడు తనని కాదు అన్నట్లు తప్పుకుంటుంటాడు సాధారణముగా.

''చెట్టంత కుర్రవాడు ఇంకా లేవకపోతే, ఇంటికి దరిద్రం, విడిచిపెట్టని శని, చుట్టు కుంటాయి'' — పాతకాలపు మనిషి ప్రకాష్ బామ్మ హెచ్చరింపు అనునయం.

''అబ్బబ్బ మీ మాటలకు, అంతులేకుండా పోతుంది. అవి వింటుంటె ఎక్కడికయినా పారి పోవాలనిపిస్తుంది'' అంటూ కాలకృత్యాలు తీర్చుకున్నాడు మెల్లగా ప్రకాష్.

''ఏరా ? నిన్న ఇంటర్వ్యూకి వెళ్ళివచ్చావట గద ! ఏమయింది ? ఈ సారయినా వస్తుందం టావా'' ప్రకాష్ బాబాయి పాపారావు మాట. ఆయన ఈరోజే ఉదయం ఆరు గంటలకు వేరే ఊరి నుంచి వచ్చాడు. వారిది ఉమ్మడి కుటుంబం.

''ఆ...ఇంకా ఏమవుతుంది ? దాన్నికూడా బాడిదలో కలిపేసి వచ్చుంటాడు. అయినా వీడి సోమరిపోతు ముఖము చూసి ఎవడయినా ఉద్యోగం కూడా ఇస్తాడా?'' వ్యంగానికి హద్దు లేకుండా పలికింది ప్రకాష్ బామ్మ.

విసుగ్గా మళ్ళీ మంచం మీద పడుకున్నాడు ప్రకాష్, గుండెల్లో శూలాల వంటి మాటలు దిగబడుతుంటె.

అయినా... ఈ మధ్యలో అసలు చదవటం లేదు మరిదిగారు, చదివి కష్టపడి రాసేవాళ్ళకే గతిలేదు, ఇలా మంచానికి అతుక్కుపోయి పడుకుంటే ఇంకేం వస్తుంది ? — ప్రశ్నలా అడుగుతూ వ్యంగాన్ని ధ్వనింప చేసింది శాంత. ఆమె ప్రకాష్ పెద్ద ఒదినగారు. ఆమె ప్రకాష్‌కంటే పదిహేను ఏళ్ళు పెద్ద.

''ఒరేయ్ ! ఇంకా చదివితే కళ్ళుపోతాయి. చదివింది చాల్లేగాని ఇంక పడుకోరా. పరీక్షకు ప్రిపేరయ్యే వాళ్ళలో ఇంతకంటె, బాగా చదివేవాళ్ళు ఉంటారని. నేను అనుకోవటము లేదు'' అని అభిమానంగా పలికే వదినేనా ఈమె. ఈమెది నాలుకా లేక తాటిపట్టా — అనుకున్నాడు ప్రకాష్.

వసుంధరమ్మ నిస్సహాయంగా చూస్తూ ఊరుకుంది.

''అలా రోగిష్టి వెధవలాగా,జీవచ్ఛవంలాగా, మంచానికి అతుక్కుపోయి పడుకోకపోతే, అలా బజారులోకి తగలబడి నాలుగు వీధులు తిరిగి, హుషారుగా ఉండరాదట్రా. అయినా నిన్నని ఏం లాభం. మీ నాయన్ని అనాలి, చదివించగానే

సరిపోయిందా ఏదో ఒక ఉద్యోగంలో పలుకుబడితో, ఇరికించాలని తెలియదు'' ఏకధాటిగా అంది ప్రకాష్ బామ్మ.

''నీతి, సంస్కారం, ఏకోశాన లేని ఈ రోజుల్లో మంచి తెలివయినా ఉండాలి, లేకపోతే డబ్బుకాని పలుకుబడికాని ఉండాలి. ఇవి లేకపోతే మనుగడ సాగించటం కష్టం ఈ లోకంలో. నువ్వింకా అలా బుద్ధావతారంలా కూర్చుంటే లాభం లేదురా. మీ నాన్నేమో ధర్మం ! ధర్మం! అంటూ న్యాయం చుట్టూ, ప్రాకులాడుతాడు. కాబట్టి బతుకు తెరువు చూసుకోవల్సిన బాధ్యత నీ మీదే ఉంది. ఇన్నాళ్ళు నీకు చెప్పలేదు. నీవు తెలుసుకుంటావని. కాని ఈరోజు చెప్పక తప్పటం లేదు'' అంటూ తలెత్తి చూశాడు ప్రకాష్ బాబాయి, ప్రకాష్ వైపు.

కాని ప్రకాష్ అక్కడ లేదు, గుమ్మంలో ఉన్నాడు, బయటికి వెళుతూ భారమయిన హృదయంతో.

ఛీ!ఛీ! తనను నీచంగా చూస్తున్నారు. అందరూ తనని ఊరికే నిందిస్తున్నారు. అయినా తనేమి చేసాడని. రోజూ, కష్టపడి చదువుతునే ఉన్నాడు ఆ పరీక్షలకని ఈ పరీక్షలకని.ఎం.కామ్ చదివి పదహారునెలలయినా, రోజూ ఇంటి పనులు అన్నీ కాకపోయినా కొన్నయినా చేస్తూనే ఉన్నాడు. నిన్న జరిగిన సంఘటన గుర్తొచ్చిందతనికి. ఇంట్లో అటు ఇటు తిరుగుతున్నాడు తను, నాన్నని ఇంటర్వ్యూ ఖర్చులకు డబ్బు ఎలా అడగాలా అని ? ఇంతలో చిన్న వదినకు తను అడ్డువచ్చానేమో ? ఆమె హడావుడిగా వస్తున్నదేమో ? తనకు తగిలి ఆమె హేండ్‌బాగ్ క్రిందపడి దానిలోని వస్తువులన్నీ చెల్లాచెదు రయినాయి. ఆమె కోపంగా ఎంత క్రూరంగా అంది... కళ్ళు కలిపించటం లేదు ? నువ్వు ఉద్యోగం చేసి బయటకు వెళ్ళేదేమీ లేదు. వెళుతున్న వారికి కాళ్ళకి చేతులకి అడ్డువస్తు తిరగకపోతే ఆ మంచంపైనే పడుకోకూడదూ ? ఎప్పుడూ నీకు అలవాటేగా... అంటూ వెళ్ళి పోయింది హేండ్‌బాగ్ తీసుకొని. ఉద్యోగం చేస్తున్నదని గర్వం కాబోలు అనుకున్నాడు తను. సిగ్గుతో చచ్చిపోయాడు ఆరోజు. అవమానం భరించలేక అలా వీధిలోకి తిరిగి వస్తే... అలా వీధులవెంట పిచ్చి కుక్కలా తిరగకపోతే ఇంటి పనులు కాస్త చూడరాదుట్రా, ఊళ్ళో నీకు ఏం రాచకార్యాలున్నాయి అని చక్కబెట్టుకోడానికి వెళ్ళావు... అంది అమ్మ. ఆమె ఎప్పుడూ తనను పల్లెత్తు మాట అని ఎరుగదు. ఆమెకు వదిన మాటలు కోపాన్ని తెప్పించాయికాబోలు, ఆమెనేమి అనలేక, తన కోపాన్ని నా మీద చూపించింది. అవును తను అందరికి చిక్కుతున్నాడు అన్ని విషయాల్లోను. కారణం ఏదయినా తనను నిందించటం అలవాటయిపోయింది అందరికి. చివరకు అమ్మ కూడా. ఆ మాట అనుకున్నప్పుడు అతని కళ్ళలో కన్నీళ్ళు తిరిగాయి.

ఆరోజు అత్తయ్య వస్తే, ఆమె వచ్చీ రాక ముందే ప్రారంభించింది బామ్మ తన విషయం. ఉద్యోగం లేకుండా వెధవ లాగా తిరుగుతున్నాడని, ఉత్త బడుద్ధాయిగా మారాడని, ఎందుకు పనికి రాని దద్దమ్మలా ఇంట్లోపడి ఉంటున్నాడని, మీ అమ్మాయికి, వాడి మీద ఆశ వదులుకుని వేరే సంబంధం ఖాయపర్చుకొమ్మని. అత్తయ్య నాలుగు మెటికలు విరిచి ఆ మధ్యాహ్నమే మళ్ళీ బండెక్కింది. ఛీ ! ఛీ ! అందరికి లోకువయిపోయాడు తను. ముందు ఈ ఇంటి నుంచి బయటికి వెళితేగాని బాగుపడడు తను. ఆలోచించుకొంటూ నడవసాగాడు.

ప్రకాష్ ! ప్రకాష్ ! అన్న పిలుపుతో ఆగి చూశాడు. ఎదురుగా సురేష్. ఏమిట్రా పట్ట పగలే ఆలోచనల్లో వున్నావు.

ఏమిటన్నట్లు చూశాడు విసుగ్గా, క్రొత్త బట్టలు వేసుకొని ఉన్న సురేష్‌ని.

ఏరా ! ఈరోజు నా పుట్టినరోజని, నీవు తప్పకుండా రావాలని, మన ఫ్రెండ్స్ అంతా వస్తున్నారని అంత గట్టిగా నీకు నిన్న చెబితే అప్పుడే మరిచిపోయావా ? నీకోసం అంతా ఎదురు చూస్తున్నాం. నువ్వు తప్ప మిగతా అంతా వచ్చేశారు. నీ కోసం మీ ఇంటికి వెళ్ళి వస్తున్నాను. పద ! పద ! ఇంకా ఆలోచిస్తున్నావు... అంటూ అతని చెయ్యి పట్టుకొని లాగాడు దబాయింపుగా.

అతని ఆప్యాయతకు చలించి పోయాడు ప్రకాష్. కాని అక్కడికి వెళ్తే ఏం జరిగేది అతడు ఒకసారి గ్రహించి ఉన్నాడు. పోయిన నెలలో ఇలాగే పుట్టిన రోజని వెళ్తే ఎంత అవమానం జరిగింది. అందరూ తనను వింత పశువును చూసినట్లు చూశారు. ఇంకా ఉద్యోగం రాలేదా అని ఎగతాళి చేశారు. తను సిగ్గుతో చిక్కచచ్చిపోయాడారోజు. దాదాపు అక్కడున్న వాళ్ళంతా ఏదో విధంగా సంపాదిస్తున్నవారే. వాళ్ళముందు తలెత్తుకు పోలేక పోయాడు ఇంటికి వస్తున్నప్పుడు.

ఆనాటి తన దీన పరిస్థితికి కన్నీళ్ళు తిరిగాయి అతని కళ్ళలో.

సారీ రా ! నేను రాలేను. చేయి విదిలించుకుని మరో వైపు కదిలాడు.

వింతగా చూసి ఏమనుకున్నాడో ? ఏమో ? వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు సురేష్ వడివడిగా.

ఛీ! తను అలా ప్రవర్తించకపోతే బాగుండునేమో ! అనుకున్నాడు ప్రకాష్ ఒక్క క్షణం; అలా వీధులు తిరిగి తిరిగి ఇంటికి చేరాడు.

ఎదురుగా బామ్మ— ''అలా పది లంఖణాలు చేసినవాడిలా ముఖంపెట్టకు. మీనాన్నభోజనానికి కూర్చోని ఉన్నాడు. నువ్వు కూడా వెళ్ళి చెయ్యి. వాడుచూస్తే బాధపడతాడు'' ఏదోఅనబోయాడు ప్రకాష్, ఇంతలో అమ్మ —''రా ! రా ! ఆమె మాటలకు ఏంకాని. మీరూరుకోండి అత్తయ్యా !'' ఎంతయినా తల్లి కదా.

భోజనానికి కూర్చోబోయాడు. ఇంతలో — ''అన్నయ్యా ! నీకు కవరు వచ్చింది పోస్టులో'' అంటూ కవరు తెచ్చియిచ్చింది పెద్ద చెల్లెలు అనుపమ.

నిర్వికారంగా చింపి చూశాడు. ''జాబ్ ఆర్డర్స్'' హైదరాబాదులో చిన్న ఉద్యోగం కంపెనీలో. రెండువందలయాభై రూపాయలు జీతం.

''అమ్మా ! నాకు ఉద్యోగం వచ్చింది'' సంతోషముగా చెప్పాడు. వివరాలు చెప్పాడు.

ఆమె ముఖములో కళ తప్పింది. చెప్పటం ప్రారంభించింది.

''బాబూ ప్రకాష్ ! ఇక్కడ నీకు ఏం తక్కువయిందనిరా, ఆ ఉద్యోగం కోసం వెళతానంటావు. ఆ రెండువందలయాభై రూపాయలతో ఆ భాగ్యనగరంలో మూడు పూట్ల భోజనము అయినా చేయగలుగుతావా సరిగ్గా. ఆలస్యం అయినా మంచి ఉద్యోగంలో చేరాలిగాని అలా ప్రైవేటు కంపెనీలలో వారి దయా ధర్మం మీద జీవించే ఉద్యోగాలలో చేరితే చివరకు నష్టపోయేది మనమే. నిన్ను మందలిస్తున్నది, ఇంకా శ్రమపడి మంచి ఉద్యోగంలో చేరతావని కాని ఇటువంటి చిన్న ఉద్యోగంలో చేరమని కాదు. ఇంటినుండి వెళ్ళిపోయి నీ బతుకు నిన్ను బతకమనికాదు. నువ్వక్కడ వస్తువులతో, సరి అయిన ఇల్లు లేక, ఇంటిని అద్దెకు తీసుకొనే స్తోమతే లేక, సరి అయిన బట్టలేక, తిండికి అలమటించిపోతుంటే, మేమిక్కడ హాయిగా ఎలా ఉండగలుగుతామనుకున్నావు. వద్దురా ! నా మాట విను. అందులోను అది పల్లెకాదు భాగ్యనగరం, అందులో నువ్వు ఉండలేవన్నది నిర్వివాదంశం. ఏమండీ ! మీరయినా చెప్పండి. వాడిని వెళ్ళవద్దని చెప్పండి. పైమెరుగులకు మోసపోవద్దని చెప్పండి. నాకు కడుపుకోత పెట్టవద్దని చెప్పండి'' గద్గదమయింది ఆమె స్వరం.

'తల్లి మనసు' ఎలా ఉంటుందో ప్రత్యక్షంగా చూశాడు ప్రకాష్. ఆశ్చర్యంగా చూడసాగాడు. కాని అతని నిర్ణయం మారలేదు. తండ్రి వైపు చూశాడు భావరహితంగా, ఆయనేం చెపుతాడో వినాలన్న కుతూహలాన్ని కనపరుస్తూ.

''నేనయితే ప్రకాష్‌ని వెళ్ళమంటున్నాను ఆ ఉద్యోగానికి''అన్నాడు.

ఆనందముగా చూశాడు ప్రకాష్ తన తండ్రి వైపు. తనకు కొండంత అండ తన తండ్రి అనుకున్నాడు మనస్సులో.

''ఏమండీ ! మీరేనా ఆ మాట అంటున్నది. నా కళ్ళల్లోకి చూసి చెప్పండి.'' నిలదీసింది వసుంధరమ్మ.

''అవును ! వసుంధర నేనే చెబుతున్నాను ఆ మాటను. ఈనాటి సమాజం పరిస్థితి తెలుసు మనకు. అందరు ఆఫీసర్లు, మేనేజర్లు,

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## ఎం. బి. కె. – బెండమూర్లంక

నేనో దురదృష్టవంతురాలిని. చిన్నప్పట్నుంచి నడవలేను. కాళ్ళు మెలికలు తిరిగిపోయాయి. తల్లిని గూడా పోగొట్టుకున్నాను. కుటుంబ సభ్యులు చాలా చులకనగానూ, నీచంగానూ నేను బ్రతకడమే దండగన్నట్లు చూస్తున్నారు. నీకు పెళ్ళికాదు, జీవితాంతం పోషించాలి. ఎక్కడికైనా పొమ్మని తిడతారు, ఎక్కడికి పోగలను? చావాలనే కోరికను బలవంతంగా ఆపుకుంటున్నాను. జీవితంలో చిన్న మార్పుకోసం ఆశతో ఎదురుచూస్తూ ఆవేదనతో కృంగిపోతున్న తరుణంలో జూన్ 26 న తేదీ ఒక దినపత్రిక ఆదివారం అనుబంధం పేపర్‌లో కెనడాలో ముర్రే అనే అతనికి ప్రమాదవశాత్తు చేతులు నరకాల్సిరావం, ఆ తరువాత ఆస్థానంలో కృత్రిమ చేతులు అమర్చటం, వాటితో అతను తన పనులన్నీ చేసుకోవటం చదివి నాలో చిన్న ఆశ. నా కాళ్ళు కూడా తొలగించి కృత్రిమ కాళ్ళు అమర్చేందుకు వీలుంటుందా? మన దేశంలో ఎక్కడ చేస్తారు? ఎంత ఖర్చవుతుంది?

★ మీరు మద్రాసులోగాని, హైదరాబాద్‌లోగాని, విశాఖపట్నం, గుంటూరు మొదలయిన చోట్లగాని, మెడికల్ కాలేజీ ఆస్పత్రులలో ఆర్థోపీడిక్ డిపార్టుమెంటులో చూపించుకొని వారి సలహా పొందటం మంచిది. బీదవారికి, ఉచిత సౌకర్యాలు ఉన్నాయి. స్థానిక లయన్స్ క్లబ్బు, లేక రోటరీ క్లబ్బువారు తప్పక సహాయం చేస్తారు. వారిని కలవండి.

## ఎ. ఎ. – అలహాబాద్

మా అబ్బాయికి 3 సంవత్సరములు నడుస్తున్నవి. ఇంకా మాటలు రాలేదు. నాకు చాలా విచారముగా వున్నది. మాటలు రావటానికి ఏమి చెయ్యమంటారు?

★ ముందు ఇ. ఎన్. టి. వైద్యులకి చూపించండి. నాలుక, చెవులు, వోకల్ కార్డ్స్ సరిగా ఉన్నాయని తీర్మానించుకోవటం అవసరం.

## పి. ఎస్. ఆర్. – భిలాయి

నా వయస్సు 47 సంవత్సరములు. సంవత్సరము క్రితం నుండి నా కనుబొమ్మలు తెల్లబడుచున్నవి. 60 సంవత్సరములు దాటితే పర్వాలేదుగాని, ఇప్పటినుండి ఈ తెలుపుదనము చూడటానికి అసహ్యముగా వున్నది. దీనికేమైనా నివారణోపాయము వున్నదా?

★ దీనికి ప్రత్యేక నివారణ లేదు. మెలనిన్ పిగ్‌మెంట్ మెటబాలిజంలో పుట్టుకతోనే వచ్చే అవకతవకలవల్ల ఇలా జరుగుతాయి.

పుట్టుకతోనే అవలక్షణం ఉన్నా తెల్లబడటం మటుకు కొన్ని ఏళ్ళ తర్వాత జరుగుతుంది.

## కె. ఎస్. – రాజమండ్రి

మా అమ్మగారికి మడమలు నెప్పిగా వుంటున్నాయంటున్నారు. కూర్చొని లేచినా, పడుకొని లేచినా నడవడానికి చాలా బాధపడుతున్నారు. దీనికి ఏ మందులు వాడాలి?

పైపూతగా రిలాక్సిన్ అయింట్‌మెంట్‌గాని, రూబ్రిసాల్ ఆయింట్‌మెంటుగాని వాడండి. వైద్యుల సలహామేరకు లోనికి మాత్రలు వాడవచ్చును.



## చీకటిలో వెలుగురేఖ

కావాలనుకుంటె ప్రస్తుత పరిస్థితుల్లో అది గొంతెమ్మ కోరికే అవుతుంది. చదువుకునేవాళ్ళు ఎక్కువ అయిపోయారు దేశంలో. నిజానికి చెప్పాలంటె వ్యాపారస్తులు మనకంటె ఎంతో తెలివయినవారు. వారిలో చదువుకునేవారు ఎక్కువ ఉండరు. కాని వారిదగ్గర లక్షలు మురుగుతున్నాయి, కేవలం అవి అక్రమముగా సంపాదించారనుకోవటం అవివేకం. తెలివి, అదృష్టం కలసి తెచ్చిన సంపద వారి కది. తెలివయినవాడు ఏ రంగంలోనయినా రాణిస్తాడనటం నిర్వివాదంశం. ఇప్పుడితను కేవలం రెండు వందల యాభై రూపాయిల జీతంమీదే చేరవచ్చు. నిజమయిన తెలివి కలవాడే అయితే తన కృషితో కంపెనీ లాభాలను అపరిమితంగా పెరిగేటట్లు చేయవచ్చు. కంపెనీ యాజమాన్యం వారి అభిమానానికి పాత్రుడనవచ్చు. వారే దయతో అతన్ని ఆదుకోవచ్చు. ఒక స్థితికి వచ్చాక తనే స్వయం కృషితో మరొక కంపెనీని స్థాపించవచ్చు. ఇటువంటి ఉద్యోగాలను తనలాంటి అభాగ్యులకెందరికో ఇవ్వవచ్చు. కారు, బంగ్లా అన్ని హంగులు ఇచ్చే ఉద్యోగం కోసం వెదకటం కంటె అతి చిన్న ఉద్యోగంలో చేరి అతి తక్కువ వ్యవధిలో తనకు నచ్చినస్థాయికి ఎదగటం మంచిది. న్యాయాన్ని విడనాడని వాడు ఏనాటికయినా మంచి స్థాయికి వచ్చి తీరతాడు. పదిమంది అన్యాయం చేస్తున్నారు తను చేస్తుపోతే తప్పేమిటి? తన ఒక్కడి వల్ల ప్రభుత్వం బాగుపడుతుందా? అనుకోవటం కేవలం అవివేకం. న్యాయం చేసేవాళ్ళు పదిమంది అయితే అన్యాయం చేసేవాళ్ళు కూడా పదిమంది మాత్రమే ఉంటారు. మిగిలిన వారంతా తటస్థ మనస్కులు అయి ఉంటారు. వారు అన్యాయం అధర్మం చేస్తున్నవారిని చూసి తాము చేస్తే తప్పేమిటి అనే భావంతో అవినీతికి పాల్పడతారు. కాని వారు న్యాయంగా ఉన్నవారిని చూస్తే తమ తప్పును తెలుసుకుంటారు, అవినీతికి తిలోదకాలు ఇస్తారు. తటస్థంగా ఉన్నవాళ్ళు కూడా న్యాయం పక్షం చేరితే క్షణాల్లో ప్రభుత్వం అవినీతిని నిర్మూలించవచ్చు. అధర్మం పాటించే వారిని మార్చవచ్చు. వినకుంటె ఏరివేయవచ్చు. అదే న్యాయం చేసేవాళ్ళు అవినీతికి పాల్పడితే ఏమవుతుంది? సమాజం కుళ్ళు నింపుకుంటుంది. న్యాయం అన్న పదానికి అర్థం తెలీకుండాపోతుంది. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటె నిన్ను ఉద్యోగంలో వేయించటం నాకు చిటికలోని పని. కాని నేనెందుకది చేయలేదు అంటె కారణం ఇది. తన స్వశక్తితో అధికస్థాయిలో నిలబడిన కొడుకును చూసుకోవాలని కాని, నామీద ఆధారపడి నిలబడిన కొడుకుని చూసుకోవాలనిలేదు. న్యాయం, తెలివి, ఉన్నవారికి ఏ రంగంలోనయినా పురోగమించడమేగాని తిరోగమించటం అంటూ ఉండదు. కాబట్టి ఈ రోజే నీవు బయలుదేరవచ్చు. నా ఆశీస్సులు నీకెప్పుడు ఉంటాయి.''

మెచ్చుకోలుగా చూసింది వసుంధర తన భర్తవంక. రేపు 'దీపావళి' అన్న సంగతి గుర్తు వచ్చింది ఆమెకు.

''ప్రకాష్ రేపు పండుగరా. రేపొక్క రోజు ఉండి వెళ్ళరా! దీపావళి వెలుగులు నింపుకొని వెళ్ళరా!'' అంది వసుంధర.

''లేదమ్మా! నేనీ రోజే వెళతాను. నాన్నగారు చెప్పింది విన్నావుకదా! దీపావళి వెలుగులు, నేనా భాగ్య నగరంలోనే చూస్తాను. వర్తకులు తమ పాత కాతాలను రద్దుచేసి, క్రొత్త జీవితాన్ని, క్రొత్త సంవత్సరాన్ని, క్రొత్త కాతాలను రేపటి నుంచి ప్రారంభిస్తారు. నేను నా క్రొత్త జీవితాన్ని ఆ దీపావళి వెలుగులతో రేపటినుండి ప్రారంభిస్తాను. దీపావళి, దీపావళికి నాతో, నా జీవితంలో ఎదుగుదల కనిపించేట్టు, స్థాయి పెరిగేవిధంగాను, దేవుడిని ప్రార్థించి, నన్ను ఆశీర్వదించి పంపమ్మా!'' అన్నాడు ప్రకాష్ దృఢనిశ్చయంతోకూడిన 'కంఠంతో'.

''సరే! తండ్రి కొడుకులు ఏకమయిన తర్వాత నేను మాత్రం ఏం చేస్తాను. మీ ఇష్టమే నా ఇష్టం' అంది సంతోషంగా వసుంధరమ్మ.

ఆ రోజు రాత్రి బయలువేరాడు ప్రకాష్ దృఢ నిశ్చయంతోకూడిన నడకతో, దీపావళి వెలుగులతో తన క్రొత్త జీవితాన్ని ప్రారంభించాలనే సంకల్పంతో, తండ్రి మాటలు చెవుల్లో గింగురుమంటుండగా, తల్లి ఆశీస్సులు గుర్తుకు తెస్తుండగా, చీకటిలో వెలుగురేఖ వైపు పయనిస్తు.




నేనలా విస్తు పోయి
చూస్తూ వుండి పోయా
NEW! EXTRA POWER
SUPER 777
WORLD'S NO.1 DETERGENT BAR
Weight when packed: 150 gm. net
Max. Price: Rs. 1.92 Local Taxes Extra

# స్వప్నభంగం
## సీరియల్
## డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

తెనాలిలో శ్రీనాధుడికి సన్మానం జరిగింది. స్థానిక నటరాజ కళాసమాఖ్యావారు తమ వార్షికోత్సవ సందర్భంలో శ్రీనాధుడికి ఈసారి సన్మానం చేయాలని నిశ్చయించుకున్నారు. అతి కష్టంమీద శ్రీనాధుడు అంగీకరించాడు. సన్మానసభకు మంగతాయారును రమ్మన్నాడు కాని రాలేదు. శ్రీనాధుడే బస్సెక్కి తెనాలి చేరాడు — కార్యకర్తలు చాలా గౌరవంగా చూచారు శ్రీనాధుణ్ణి. సభ ప్రారంభమైంది—

''అధ్యక్షోపన్యాసంలో ఆయన చెప్పారు — శ్రీనాధుడు కేవలం మన మండలమే కాదు మొత్తం ఆంధ్రదేశం గర్వించదగ్గ కవి. ఇలాంటి భావుకుడు మన జిల్లావాడు అందులోనూ మన తాలూకావాడు కావడం మన అదృష్టం — మన తెనాలికి పక్కన ఈమనివాడు కావడం ఇంకా ఇంకా మన సౌభాగ్యం. రచయితలను మనం ఇక మీద జిల్లాలస్థాయిలో విభజించి చూడాలి. పూర్వం శ్రీనాధుడి రెడ్డి రాజ్యానికీ మండన మిత్రుడి కర్నాటక రాజ్యానికి చాలా దెబ్బలాట వుండేది — (''మండన మిత్రుడుకాదు డిండిమ భట్టు'' అని ఒకరి కేక) క్షమించండి — ఇందాకే బోస్ రోడ్‌లో శంకర జయంతి సభలో పాల్గొని వచ్చాను. అందుకని పొరపాటుపడుతున్నాను. అలా డిండిమభట్టును అలనాటి శ్రీనాధుడు ఓడించడంవల్లనే రెడ్డి రాజ్యానికి కీర్తి ప్రతిష్టలు లభించాయి. సోదరులారా! మనమంతా ఇకమీద ఒక నవ సమాజ నిర్మాణానికి నడుంకట్టి వున్నాము. అధికోత్పత్తి మన లక్ష్యం. అన్ని రంగాలలోనూ ఎక్కడికక్కడ సర్వతోముఖాభివృద్ధి స్వయం సమృద్ధి ఆదర్శాలుగా మన కార్యక్రమాలు ఏర్పాటు చేసుకున్నాం. కాబట్టి రచయితలల్లో కూడా మనం అధికోత్పత్తినీ స్వయం సమృద్ధినీ సాధించాలి. పొగాకును ఎలా మనం గుంటూరు తెనాలినుండి విదేశాలకు ఎగుమతి చేస్తున్నామో అలాగే రచయితలనుకూడా ఇతర దేశాలకు ముఖ్యంగా ఇతిర రాష్ట్రాలకు అందివ్వగలగాలి. ఇతర ప్రాంతాలవారూ మనలనుమిగులురాష్ట్రంగా ఆదర్శప్రాంతంగా గుర్తించాలంటే మనం శ్రీనాధుడి వంటి రచయితలను ఎక్కువగా ప్రోత్సహించాలి. ఇప్పుడు రైతులకు మనం ఎలా రుణాలు ఇప్పించి అధికోత్పత్తినిచ్చే వంగడాలను సప్లై చేస్తున్నామో అలాగే మనం అక్షరాస్యుడైన ప్రతివాడికీ తక్కువ ఖరీదుకు కలాలూ కాగితాలూ సప్లై చేయించాలి. ఇల్లిల్లూ ఒక కర్మాగారం కావాలి— ఒక సాహిత్య మందిరం కావాలి— ఒక శారదా సుందరం కావాలి— (చప్పట్లు.) సోదరులారా! ఇప్పటికే అకాలమయింది — శ్రీనాధునివంటి కవులు ఎక్కువ సంఖ్యలో రావడానికై కవుల కాలేజీలు కొన్ని స్థాపించాలని మనం స్థానిక ఎం.ఎల్.ఏ.ల ద్వారా మంత్రివర్గంపై వత్తిడి తీసుకురావాలి. (చప్పట్లు) అలాంటి కాలేజీలు తీసుకురాకపోతే మనం ఓట్లు వేసేది లేదు— (దీనికి సగం మంది మాత్రమే చప్పట్లు కొట్టారు.) మొన్నచూడండి విజయవాడ కవతల పదిబెడ్ల హాస్పటల్ స్థానిక కార్యకర్తల సహకారంతో చందాలతో నిర్మించి ప్రారంభోత్సవం చేసివచ్చాను. ఆనాడు చెప్పాను ఇది నూరుబెడ్ల హాస్పటల్‌గా మారాలని— అలాగే అయింది— ఇకమీద అది వెయ్యిబెడ్ల హాస్పటల్ కావాలి (చప్పట్లు.) ఆవూరూ వూరు ఓ పెద్ద హాస్పటల్‌గా మారాలి— అక్కడ ఇక ఇళ్లూ మనుషులూ మిగలకూడదు (చప్పట్లు—) అలాగే మిత్రులారా! మనం శ్రీనాధునివంటి కవులను పోషించాలి— ఇలాంటి శారదామూర్తులే గుంటూరు, విజయవాడ, ఒంగోలు, కాకినాడ, విశాఖ, హైదరాబాదు వంటి ప్రాంతాలకు ఆదర్శంగా వుండి వారినుండి వారంతా స్ఫూర్తి పొందాలి— ఈ సభను నన్ను అధ్యక్షత వహించ మన్నందుకు కృతజ్ఞుణ్ణి— మరో సమావేశంలో పాల్గొనాలి— జైహింద్—'' అధ్యక్షులవారు లేచి వెళ్లారు. దానిలో నటరాజ కళా సమాఖ్య అధ్యక్షుడే సభకు అధ్యక్షుడుగా కూర్చొని కార్యక్రమం నిర్వహించాడు. ఆ రాజకీయ వేత్త, వెళ్లడంతో సభలో గ్లామర్ తగ్గింది. సభాధ్యక్షుడు శ్రీనాధునితో ''ఇప్పటికే కాలాతీతమైంది. క్లుప్తంగా ఓ నాలుగైదు నిమిషాలు మాట్లాడి ముగించండి'' అన్నాడు. శ్రీనాధునికి నిరాశ కలిగింది. తన సాహిత్యం ఏ రకంగా కీట్సు షెల్లీలకంటే గొప్పదో ఈ సభలో నిరూపించాలనుకున్నాడు. వర్డ్స్‌వర్తుకన్నా ఎలా కొత్త ప్రకృతి సౌందర్యాన్ని తాను ప్రదర్శించాడో వివరించాలనుకున్నాడు. కృష్ణశాస్త్రి, రాయప్రోలు, టాగూరు వంటి కళాశిల్పుల కవిత్వాన్ని గురించి వ్యాఖ్యానించాలనుకున్నాడు. తానసలు 'తిరుపతయ్య' అన్న పేరు కళాత్మకంగా ఎలా మార్చుకున్నాడో చెప్పాలనుకున్నాడు. తిరుఅంటే శ్రీ, ప్రతిఅంటే నాధుడుకాబట్టి 'శ్రీనాధుడు'అని పెట్టుకున్నాడు. నేనేమీ వెర్రి వ్యామోహంతో కొండ్రశ్రీ గుండుశ్రీ చెట్టుశ్రీ గుట్టశ్రీ అని శ్రీని చివర తగిలించుకోవాలనే వ్యామోహంతో ఈ పని చేయలేదు — నాకు శ్రీ ముందే వచ్చింది— అదీ స్వభావసిద్ధంగా పేరులో అంతర్భాగంగానే వచ్చింది.' అని వివరించాలనుకున్నాడు—కొంచెం కొంచెం వివరించాడు కూడాను—కాని అధ్యక్షులవారు 'శ్రీనాధుల వారూ —ఇక చాలించండి' అని హెచ్చరిక.

హతాశుడై శ్రీనాధుడు ప్రసంగాన్ని ముగించాడు.

ఆ తర్వాత పూలదండ వేశారు—

ముఖాన వీరకుంకుమ పెట్టి చందనం చల్లి తాంబూలమూ ఓ ఖాదీ శాలువా ఇచ్చి సత్కరించారు.

అక్కడితో సన్మానసభ ముగిసింది.

తర్వాత నాటకాలు.

శ్రీనాధుడు కార్యకర్తలకు కృతజ్ఞత చెప్పి త్వరత్వరగా బస్‌స్టాపుకు చేరాడు — వెల్లభాపురం పోయే ఆఖరి బస్సు చెడిపోయింది — గత్యంతరం లేక స్టేషను చేరి ఓ ప్యాసెంజరు బండిలో అర్ధరాత్రికి దుగ్గిరాల చేరి అక్కడి నుండి నాలుగు కిలోమీటర్లూ నడుచుకుంటూ తొలికోడి కూసే వేళకు ఇల్లు చేరాడు— ''మధురమైన వేదనలో ఆర్ద్రమైన భావన, రసార్ద్రమైన భావనలో విధుర సుధామధురి— ఉషా! ఓ ఉషా! నా ఉషా'' అని తెల్లవారుజాముపై ఓ పాట పాడుతూ ''తాయారూ— తాయారూ—'' అని తలుపు కొట్టాడు.

మంచి నిద్దరలో వుందామె— లేచి విసుగ్గా తలుపు తీసింది.

''ఏమండీ—ఎంత టైమయింది ఇప్పుడు.''

''తెల్లవారవస్తోంది. ఉషాదేవి తెలివెన్నెల వెన్నెల తోరణం చూడు.''

''ఇంత రాత్రి వచ్చారేం.''

''బస్సులేదు— అందుకని ...''

''అక్కడే వుండి తెల్లవారాకా రాక పోయారా —''

''లేదు తాయారూ— జీవితంలో అందమైన ఒక ఉషస్సును తెనాలి డ్రైనేజీ కాలువల పక్కన వృధా చేయదలచుకోలేదు—అందుకని...''

తాయారు మాట్లాడకుండా పడుకున్నది.

ఎలాగో నిద్రపోయింది మళ్లీ — భర

**జరిగినకథ—1:** శ్రీనాధుడు సాహిత్య పిపాసి. ఆయన కవిత్వం అంటే భార్య తాయారుకు మొదట్లో సరదాగానే ఉండేది. కాని క్రమంగా విసుగు బయలు దేరింది.

మాత్రం ఏదో 'ఉషాసుందరీ' అంటూ ఏదో పాడటం ఆమెకు మగతగా విన్పడుతూనే వుంది—

తెల్లవారి లేచాక ప్రశ్నించింది 'ఏం చేశారండీ సన్మానం'.

శ్రీనాథుడు సన్మాన వివరాలన్నీ చెప్పాడు. తన్ను ఎలా అధ్యక్షుడు పొగిడిందీ ప్రేక్షకులు ఆదరించిందీ వివరించాడు —

"అదంతా సరే ఎంత డబ్బిచ్చారు ?"

"డబ్బా !" ఆశ్చర్యంగా ముఖం పెట్టాడు శ్రీనాథుడు.

"ఔను— ఎంత ఇచ్చారండీ —" సూటిగా అడిగింది.

"డబ్బెందుకే మనకు —"

తాయారుకు కోపం వచ్చింది.

"ఎందుకేమిటండీ— ఖర్చు పెట్టుకోవడానికి — మంచి ఆవునెయ్యి కిలో నలభై రూపాయలు— మొలకొలుకులు బియ్యం కిలో మూడు రూపాయల డెబ్భై అయిదు పైసలు — కందిపప్పు కిలో ఐదు రూపాయల ఇరవై పైసలు— ఉప్పు— ముష్టి ఉప్పు నా చిన్నతనంలో రూపాయికి ఇరవై మానికలు పోసి వెళ్ళడం ఎరుగుదును— ఇప్పుడు పాకెట్ మూట ముప్ఫై పైసలు— ఇక పెసలు..."

'పోనిద్దూ, ఈ జాబితా అంతా ఎందుకిప్పుడు మంగా—'

'ఎందుకేమిటండీ— నిద్రలేచిన దగ్గరి నుంచీ మనకు కావలసింది ఇదే—ఉప్పు పప్పూ నెయ్యి బియ్యం ఇవే కావాలి— మీ ఉగాదులూ ఉషస్సూ నిశీథులూ త్రిసంధ్యలూ ఎవడిక్కావాలంట— ఉషస్సు తిండి పెట్టదు— నిశీధి నెయ్యి నివ్వదు— రాత్రిపూట చుక్కలు బియ్యాన్నీ, వెన్నెల ఉప్పునూ పప్పునూ ఎన్నడైనా రాల్చాయా ?— చెప్పండీ నా ప్రశ్నకు సూటిగా జవాబు—'

శ్రీనాథుడు నిట్టూర్చాడు— ఒక్క క్షణం ఆగి అన్నాడు, 'అంటే నీ ఉద్దేశం ఏమిటి కవిత్వాన్ని కమర్షియలైజ్ చేయమంటావా ? అక్షరాలను అమ్ముకొని శబ్ద వర్తకుణ్ణి కావాలంటావా ?'

'అయ్యో ఖర్మ ! మీరు అమ్మినా, మీవద్ద కొనే తలకుమాసిన వాడెవడండీ— ఎవరికి కావాలి మీ ముష్టి కవిత్వాలు— ఇంతకూ మీరు మాట దాటవేశారు— వాళ్ళు డబ్బు ఎందుకివ్వలేదూ అని నేనడుగుతున్నాను— డబ్బు లేనప్పుడు సన్మానానికెందు కంగీకరించారు ? కనీసం రానూ పోనూ కారన్నా ఇవ్వవద్దూ.'

'చూడు— మంగా— కారుమీద మోజు పెరిగితే కవిత్వం అస్తి నాస్తి చికిత్సలో పడుతుంది. అప్పుడు కవిత్వం పెట్రోలు వాసన కొడుతుంది. పచ్చకర్పూరంతో రంగరించి సింగారించిన రచయితల శ్రీగంధపు వాసన రాదు— నా కేదో దేవుడు కొద్దిగా భూమి ఇచ్చాడు. ఉండనొక ఇల్లు వున్నది — భుక్తికి లోపం లేకుండా వెళ్తున్నది — కవిత్వం వ్రాయడానికి ఇంతకు మించిన దివ్యవాతావరణం మరింకేమిటి కావాలి తాయారూ — ధనాశతో పరుగెత్తినా టాల్‌స్టాయి కథలా ఆరడుగులే మిగులుతుంది — విలువైన ఈ జీవితాన్ని శబ్దముద్రలో నిబద్ధం చేసి ధన్యులవౌదాము— చరితార్థులవౌదాము — చిరంజీవులవౌదాము."

మంగ హతాశురాలైంది— మారుమాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళింది — భర్తకు వేసిన పూలదండ వాడిపోయి అక్కడ పడేసి వుంది — దాని పక్కనే ఖాదీశాలువ — దానిమీద దుకాణం వాడు అంటించిన ఖరీదు చీటీ కూడా వుంది —



పదహారు రూపాయల యాభై ఆరు పైసలు — అందులో ఓ రూపాయి రానూపోనూ చార్జీలకీ వదిలింది— ముష్టి పదిహేను రూపాయల సంపాదనకా రాత్రిళ్లా నిద్రకాచి ఇన్ని మైళ్లు నడిచి వచ్చింది ??

వాళ్లేం లేనివాళ్లా ??

మొన్ననే కదా ఒక మంత్రిగారిని సన్మానించడానికి పదిహేనువేలు ఖర్చుపెట్టారు ?? నర్తకి పంకజగంధికి పదివేలు ఇచ్చారు—

తన భర్త ఎలా అర్థం చేసుకుంటాడీ వేదనను ?

నూటపదహార్లు కనీసం అర్ధనూట పదహార్లు భర్తకు రావాలని కోరుకోవడం అన్యాయమా ? అక్రమమా ??

సరస్వతికి అపచారమా ??

పూర్వం మహారాజులు గుర్తించి పోషించే వారట—

ఇప్పుడెవరున్నారు ??

ప్రజలే కదా ??

వాళ్లు శ్రీనాథుణ్ణి గుర్తిస్తున్నారా ??

వాళ్లకి ప్రకృతి ఉపాసకులతో పని వుందా??

శ్రీనాథుడు జఘన్య శృంగారాన్ని వర్ణించలేదు. కచకుచాలపై పద్యాలు వ్రాయలేదు. కవిచౌడప్పను ఆధునికంగా ఆవిష్కరించలేదు. కాబట్టే శ్రీనాథునికి మార్కెట్ లేదు.

శ్రీనాథుడు ఖద్దరు శాలువా తప్ప సంపాదించలేదు. తానూ తన అక్కలాగా మేడ కట్టుకోవాలనీ అందులో ఓ టి.వి. ఓ ఫ్రిడ్జ్, ఓ ఎయిర్ గుల్‌మార్గ్ ఎయిర్ కూలర్, ఓ డెకోలమ్ కంబెడ్స్ అలంకరించుకోవాలనీ అనుకుంటున్నది.

తానూ ఫారిన్ నైలెక్సులు కొనుక్కోవాలనుకుంటున్నది.

అది శ్రీనాథుని సన్మానాలతో సాధ్యమా ?

అసంభవం !!

మంగతాయారు మనస్సు వికలమైంది.

ఆమె ఏదోలా వంట చేసింది.

# స్వప్న భంగం

శ్రీనాథుడు భోంచేస్తూ అడిగాడు ''మంగా ! వంకాయకూరలో ఎండుకొబ్బరి కోరి వెయ్యలేదేమిటి ? పైగా లవణం కూడా ఓ కల్లు ఎక్కువైంది —''

తాయారు మాట్లాడలేదు.

''ఏం మంగా — ఎందుకిలా ఉప్పు ఎక్కువ వేశావు ?''

''అవునండీ — కొందరి బ్రతుకులు కౌదుగా వుంటాయి — వారినుండి మీవంటి మహాకవులు తీపినెలా ఆశిస్తారు ?''

* * *

తాయారూ, శ్రీనాథుడూ తిరుపతి కొండ మెట్లెక్కడం మొదలుపెట్టారు.

పెట్టెను మాత్రం తమ వూరినుండే మొక్కుకై వచ్చిన ఒక తెలిసినవాడితో బస్సులో ముందుగా పంపించారు.

బాగా ఎండ తగ్గాక సాయంత్రం ఏ మూడున్నర నాలుగు గంటలకో నడక మొదలైంది.

ఒక్క మోకాళ్ల పర్వతం చేరడానికే గంటకు పైగా పట్టింది. 'ఏడుకొండలవాడా ! వడ్డికాసులవాడా ! అడుగడుగు దండాలవాడా ! గోవిందా ! గోవిందా !' కొండ నెక్కుతున్న భక్తుల నిరవధిక స్తోత్ర పాఠాలు.

''అబ్బా — నేనింక ఎక్కలేను బాబూ' తాయారు ఓ గోపురం వద్ద కూలబడింది.

శ్రీనాథుడు నవ్వాడు —

''మంగా ! శ్రమిస్తేనేకాని శ్రీనివాస సాన్నిధ్యం లభించదని దానిలోని అంతరార్థం. ఇంటినుండి కారులో బయలుదేరి స్వామివారి సింహద్వారం ముందు దిగితే అతడికి స్వామి నందుకోవడంలోవున్న కష్టం ఎలా తెలుస్తుంది? అందుకే చూడు శ్రీశైలం, తిరుపతి,అమరనాథ్ బదరీ అన్నీ పర్వతాగ్రాలమీద, కీకారణ్యాల మధ్య దాట వీలుకాని నదులకు నడుమ నిలిచాయి — వెలిశాయి.''

తాయారు శరీర శ్రమను భర్త మాటలు పోగొట్టలేకపోయాయి. ఆ గోపురంలో సోడాలు అమ్ముతున్నారు.

తాయారు ఓ సోడా తాగింది.

కాసిని పల్లీలు బటానీలు కొనుక్కొని తిరిగి నడక సాగించింది.

శ్రీనాథుడు మాత్రం హుషారుగా పాల పిట్టలా దూసుకొంటూ ముందుకు సాగాడు.

భక్తులు రకరకాల వేషాలవాళ్లు భాషల వాళ్లు వయసులవాళ్లు మూటలు కూడా నెత్తిని పెట్టుకొని నడకమార్గంలో పయనం సాగిస్తున్నారు.

రకరకాల కోరికల వాళ్లు.

గమ్యాల వాళ్లు.

చేస్తున్న రత్నాల వ్యాపారంలో లాభం వచ్చినందుకు నడిచి ఎక్కి మొక్కు చెల్లించి ఓ రత్నాన్ని స్వామి వారి హుండీలో వేసేందుకు వస్తున్న చీదరు చెన్న బసప్ప—

కూతుళ్ల పెళ్లి కోసం గత్యంతరం లేక పొలమూ, ఇల్లూ అమ్మి ఎన్నికలలో నిలబడి గెలిచి పదవి సంపాదించి అది ఇప్పించినందుకు గాను బాలాజీకి తల నీలాలు సమర్పించడానికి వచ్చిన ఒక యు. పి. వాలా.

దత్తు తీసుకున్న ముసలమ్మ త్వరగా కాలం చేసి ఆస్తి అధికారం చేతికి వచ్చినందుకు — కల్యాణం చేయించడానికి బయలుదేరిన ఉలవపాడు వెంకయ్య. నయం కాదనుకున్న టి. బి. నుండి బయటపడి పత్నీసమేతంగా నేరుగా రాయవెల్లూరు నుండే తిరుపతి కొండ ఎక్కుతున్న సాయిలూ, రత్నావళీ—

'తాయారూ కోరికలు తీసినకొద్దీ నీరూరే దొరువులవంటివి— వాటిని పరమేశ్వరుడైనా సరే సమగ్రంగా ఎలా తీరుస్తాడు ?'

మంగకు ఈ మాటలు రుచించలేదు. 'కవిరాజా ! కోరికలు ముత్యపు చిప్పలు కూడా కావచ్చు. కొందరు భక్తుల హృదయాలు స్వాతి వానకు పడే పరమేశ్వరుని అనుగ్రహ రస బిందువులకై ఎదురుచూస్తూ వుంటాయి — ఒక కిరణం ఒక తుషారం పడితే చాలు ముడుచుకొని లోలోపల దానిని ముత్యంగా మార్చుకుంటాయి.'

శ్రీనాథుని హృదయం పరవశించి పోయింది.

మంగతాయరప్పుడు ఉత్తమ జాతికి చెందిన కవిత్వం చెప్పింది. తన సహవాసంతో ఆమె జన్మ పునీతమైంది.

'మంగా ఇంత చక్కని ఉపమానం ఎలా చెప్పావు ?'

'ఏదో మీ దయవల్ల పూలతో కూడిన దారానికి వాసన పట్టదూ— చందన వృక్షం చుట్టూ వున్న దొరువులన్నీ చందన వృక్షాలుగానే మారవూ—అలాగే.'

# స్వప్న భంగం

ఈ ఉదాహరణలన్నీ తాను ఏదో సందర్భంలో వాడినవే — వాటిని తాయారు జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకున్నది — మళ్లీ తన మీదనే ప్రయోగిస్తున్నది.

తాయారు చాలా మందంగా నడుస్తున్నది— అందువల్ల శ్రీనాథుడు మనోవేగాన్ని గమన వేగంతో అనుసంధానించలేకపోయాడు.

త్రోవ కిరువైపులా రకరకాల చెట్లు, రంగు రంగుల పండ్లు, పండ్లన్నీ తినడానికుపయోగపడేవికావు. పూలన్నీ సుగంధాన్ని వెదజల్లేవీ కావు — అయినాసరే ! అన్నీ ఉండాల్సిందే — సృష్టిలో దేనిస్థానం దానిదే !

చీమలు బారులుగా సాగిపోవడంవల్ల రాతికి బాగా వేలెడు వెడల్పు బాట ఏర్పడింది.

ఎన్ని యుగాలిలా చీమలు నడిస్తే రాయి చీలిందో ఎన్ని తరాల భక్తుల నిరంతర పాద ఘట్టనవేత ఈ పుట్టలూ గుట్టలూ బాటలుగా పేటలుగా మారాయో —

''తాయారూ ! చూడు చూడు ఈ రంగు రంగుల పిట్టలెలా ఎగురు తున్నాయో — తోక ఎరుపూ తెలుపూ దేహమంతా నలుపు తలమీద వేలెడు కిరీటం — ఓహో ! ఈ ఒక్క పక్షిని చూస్తే చాలు తాయారూ మన శ్రమ మొత్తం పోయి యాత్ర సార్ధకం కావడానికి —'

తాయారు కోపంతో అన్నది 'పకులూ, కోతులూ చూచి యాత్ర సార్థకం చేసుకునేందుకుకాదు మనం వచ్చింది — మొక్కుబడి చెల్లించుకోవాలి. స్వామివారిని చూడాలి.'

''అదీ చూస్తాము. ఇదీ చూస్తాము — ఇదంతా చూడటంకూడా అది చూడటంలోని భాగమే ! ఆ విశాల నేత్రాల వాడి కరుణా కటాక్షమే ఈ ప్రకృతిగా పరిణమించి మనలను పలకరిస్తున్నది — దేహం పులకరిస్తున్నది—''

'కాని స్వామీ యాత్రీకులంతా అంత తెలివి మీరినవారు కారు. తమ దోవవెంట తాము పరుగెత్తుకుంటూ పోతున్నారు.'

'మూర్ఖులు— వాళ్లంతా భక్తులు కాదు తాయారూ— చాలామంది బేరగాళ్లు —స్వామివారి కటాక్షాన్ని అలుసుగా తీసుకొని బేరంచేసి లాభం వస్తే వడ్డీ చెల్లించేందుకు పరుగెత్తుకు పోతున్నారు— వాళ్లకీ తురాయి పిట్టల తోకలు కన్పడవు— రాళ్లమధ్య దారిపక్క పూచిన గడ్డి పూవు పలకరింపు వినపడదు— ఆకాశంలో ఈ చల్లనివేళ సప్తాశ్వాల వాడి ఒక తెల్లని కిరణం ఏడు రంగుల పూలను పూయిస్తున్నప్పుడు ఏడవ కొండపై నుండి చూడటంపేరు భగవదుపాసన కాదా ? కాని ఆ ఉపాసన చేయలేరు వీళ్లు— కేవలం పరిగెత్తుతున్నారు కాళ్లాభిముఖంగా— శలభాల్లాగా— జీవచ్ఛవాల్లాగా.'

తయారుకు భర్త సామి దూషణ చేస్తున్నాడనిపించింది— 'మీ పిచ్చి మితిమీరిపోతున్నది— దేవుని కళిముఖంగా పోయే భక్తులను దూషిస్తే మీకు పుట్టగతులు వుండవు—'

'తయారూ— తాయారూ నీదింత మట్టి బుర్ర అనుకోలేదు— దేవుణ్ణి నేను తిట్టడం లేదు— దేవుడు ఏడుకొండలపైనే కాదు ఏడు కొండలనిండా వున్నాడు చూడమంటున్నాను— ఆరాధించమంటున్నాను— ఇంతకన్నా సరళాతి సరళంగా ఇంకెలా చెప్పను నా వేదాంతం—కొండ పైనా కిందా మీదా లోపలా కూడా స్వామి నాకు దర్శనమిస్తున్నాడు—''

ఒకచోట కొండపై భాగం నుండి జలధార సన్నగా ప్రవహిస్తున్నది. కింద కాశీరత్నం తీగెలు అల్లుకొని వున్నాయి—

ఆ పక్కనే కొన్ని పేరుతెలియని గడ్డి మోదుగు ఆకులూ—

జలబిందువులు కొన్ని మోదుగు ఆకులపై బడి, చింది తుషారాలుగా మారి కాశీరత్నం పూల చిన్నారి రేకులపై చిద్రువలుగా రాలాయి—కారిన ఆ నీటిరేఖ గాలిలో కలిసి చల్లదనం కిందికి పరివర్తన చెందింది—

''ఓహో ! దివ్యసౌందర్యానికిది పరాకాష్ట ! పరమేశ్వర తత్వానికిది ప్రత్యక్ష వ్యాఖ్యానం — సౌందర్య గుణం పాకారంగా నిలిచి జలము వాయువుగా స్పర్శగా మారి శబ్దంగా పర్యవసిస్తున్నది — అనుభూతిగా పరిణామం చెందుతున్నది. తాయారూ— ఇదుగో స్వామివారినిక్కడ చూడు— పలుకుతే నేలతల్లి పవ్వళించిన వేళ సద్దుసేయకు తాయారూ—'' అన్నమాచార్యుని కీర్తనలు ఆయనలో పొంగిపొర్లుతున్నాయి — దూరాన చంద్రగిరి దుర్గం పురాతన వైభవానికి చిహ్నంగా కొడికట్టిన దీపంలా కన్పడుతున్నది.

''ఇదుగో ! ఇటు చూడు తాయారూ అగాధమైన లోయల్లో నుండి ఉవ్వెత్తున తారాజువ్వల్లా పైకిలేచిన ఈ చెట్లు ప్రకృతి దేవాలయానికి సగర్వంగా ఎత్తిన ధ్వజస్తంభాల్లా వున్నాయి — పరమేశ్వరుని పాదార్చన కోసం పుడమితల్లి దాల్చిన పూల కిరీటంలా వుంది ఈ లోయలో తలపైకెత్తిన చెట్ల సౌందర్యం'' శ్రీనాథుడు ఏదో లోకంలో విహరిస్తున్నాడు. అక్కడ బస్సు రోడ్డూ—కాలిబాటా—కలుస్తాయి.

తాను మాత్రం అలసిపోయి కాలిబాట చివర కూర్చున్నది తాయారు— ఇంతలో ఓ కారు ఆ మార్గాన దూసుకుంటూ పోతూ తాయారును చూచి ఆగింది.

వెంటనే కారు తలుపు తీసుకొని వైదేహి దిగింది

తలెత్తి తాయారు చూచింది ఆశ్చర్యంగా 'అక్కా' ''తాయారూ—ఎప్పుడు బయలుదేరారు— ఏమిటి ?''

అక్కకు చెల్లెలు తన తీర్థయాత్రాక్రమం వివరించింది.

''రానూపోనూ నడిచి వస్తామని మొక్కుకున్నా మక్కా— అందుకని ...''

''అరే— మాకు కనీసం జాబన్నా వేయలేదేమిటి ?'' వైదేహి సాధించింది.

''నేనేం కలగన్నానా మీరూ ప్రయాణం పెట్టుకున్నారని —''

''ఔను— అది కూడా నిజమే— మా వారికి ఈసారి బిజినెస్‌లో బాగా లాభం వచ్చింది — సారాయికి పనికి రావనుకున్న అనాబోషాహీని ఉత్తరాది వాడొకడు హోల్‌సేల్‌కు కొన్నాడు — రూపాయికి రెండు రూపాయల లాభం—అందుకని వారు అకస్మాత్తుగా ఇలా ప్రయాణం పెట్టారు. రాత్రి బయలుదేరాము కారులో హైదరాబాదు నుంచి—'' శ్రీనాథుడు కారు డ్రైవింగ్ చేస్తున్న లక్ష్మణమూర్తిని పలకరించాడు.

లక్ష్మణమూర్తి ముభావంగా, మర్యాదా సూచకంగా ఏవో యథోచితమైన మాటలు నాలుగు మాట్లాడాడు. ఆ మాటల్లో ఆప్యాయత లేదు. సమానస్థాయివాణ్ణి గౌరవించినట్లు లేదు.

''తాయారూ రండి, కారెక్కండి ఇద్దరూ... ఓహో — మొక్కు కదూ — సరే ! మేము కాటేజి ముందే రిజర్వు చేయించాము — మీకోసం పైన ఎదురుచూస్తుంటామయితే'' వైదేహి చెల్లెల్ని, బావగారినీ తమ కాటేజీకి ఆహ్వానించింది.

లక్ష్మణమూర్తి కాటేజీ నెంబర్ చెప్పాడు.

శ్రీనాథుడు తల వూపాడు.

వైదేహి కారెక్కింది.

చెల్లెల్ని విష్ చేస్తూ చెయ్యి వూపింది.

కారు తారురోడ్డుమీద దూసుకొని పోయింది.

ఊగుతున్న వైదేహి చేతి రత్నాల ఉంగరం కాంతులు కనపడుతున్నంత దూరం అలాగే చూచి ఆ తర్వాత లేచి తిరిగి నడక కుపక్రమించింది.

శ్రీనాథుడు నడవలేకపోతున్నా హుషారు తగ్గకుండానే సాగుతున్నాడు.

తాయారు మాత్రం ఇకపైన నడవలేక పోయింది.

వైదేహి కారు చక్రాల చారల్లో తన అడుగులు వేసి ముందుకు సాగలేకపోయింది.

**(ఇంకా వుంది)**

## గమనిక

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది. —సం.

# విమెన్స్ వరల్డ్ బ్యూటీ స్కూల్

ఇంటి దగ్గరే స్వంతంగా అలంకరణ చేసుకోడానికి వీలుగాను, స్వంతంగా కొద్దిపాటి పెట్టుబడితో బ్యూటీ క్లినిక్ నడుపుకోడానికి వీలుగాను స్త్రీలకు శిక్షణ ఇచ్చేందుకు విజయవాడ, విజయా టాకీస్ సమీపంలో 'ఉమెన్స్ వరల్డ్' అనే స్కూలు నడుపుతున్నాము. ఇందులో చేరటానికి వయో పరిమితిగానీ, విద్యార్హతలుగానీ లేవు. అయితే స్త్రీలకు మాత్రమే ప్రత్యేకం. ఇంటి దగ్గర బ్యూటీ క్లినిక్ నడుపుకోవడం వల్ల ఆర్థికంగా కుటుంబానికి కొంత సహాయం, కాలాన్ని సద్వినియోగ పరిచినట్లు ఉంటుంది. ప్రతీసారి బ్యూటీ క్లినిక్‌కు వెళ్ళే సమయం లేనివారు ప్రతిసారి డబ్బు వృథా కాకుండా ఇంటి దగ్గరే తమకు తామే అలంకరణ చేసుకోవచ్చు.



విమెన్స్ వరల్డ్ బ్యూటీస్కూలులో తర్ఫీదు పొందిన ఒక విద్యార్థిని తాను విజయవాడ ఐ.టి.ఐ. దగ్గర స్వతంత్రంగా ప్రారంభించిన స్కూలుకి శ్రీమతి అనుపమ చే ప్రారంభోత్సవం చేయిస్తున్న దృశ్యం.

**రచయిత్రి పరిచయం**

ఈ వ్యాస రచయిత్రి శ్రీమతి అనుపమ మాస్టర్ ఆఫ్ ఫేకల్టీ అండ్ ఫిజియాట్రిస్ట్, ఇటీవల అంతర్జాతీయ ఇండిపెండెంట్ ప్రొఫెషనల్ థెరపిస్ట్సులో గ్రేడ్ 'ఏ' సభ్యత్వం పొంది, ఐ. టి. ఇ. సి. టీచర్సు ట్రైనింగ్ డిప్లొమా (లండన్) కోర్సు కూడ చేసినట్లు తెలిపారు. ప్రస్తుతం ఈమె విజయవాడ, ఏలూరురోడ్డులో బ్యూటీ క్లినిక్ ఇంటర్‌నేషనల్, విమెన్స్ వరల్డ్ బ్యూటీ స్కూలు స్వయంగా నడుపుతున్నారు.

విమన్స్ వరల్డ్‌లో బ్రిటిష్ సిస్టమ్ బ్యూటీ థెరపీలో సర్టిఫికేటు కోర్సు, డిప్లొమా కోర్సు, ఐ. టి. ఇ. సి. (డా. ఆర్నాల్డ్ టేలర్) కోర్సులు నడుపబడుతున్నాయి. యోగాసనాలు వేయడం, మెహెందీ డిజైన్స్ వేయడం నేర్పటం కోర్సులోని ప్రత్యేకాకర్షణలు. ఈ కోర్సులో శరీర పోషణ, శరీర సౌష్ఠవం, చర్మ సౌందర్యం గురించి తీసుకోవాల్సిన జాగ్రత్తలు, కనుబొమలు తీర్చిదిద్దవలసిన తీరుతెన్నులు, కేశాలంకరణ, మూలికల ఆధారంగా చర్మానికి, తలలో వచ్చే కొన్ని వ్యాధుల నివారణోపాయం, ఇవన్నీకూడ పాఠ్య అంశాలుగా చెప్పబడుతాయి.



విమెన్స్ వరల్డ్ బ్యూటీ స్కూల్‌కి ప్రారంభోత్సవం చేస్తున్న శ్రీమతి సీతాకామరాజ్, మధ్య ఉన్నవారు శ్రీమతి సుజాతాదేవి

ఈ స్కూలు నుండి పొందిన సర్టిఫికేట్‌కు విదేశాలలో గుర్తింపు ఉంది. ఈ స్కూలు ప్రొద్దున 9 గం. నుంచి సాయంత్రం 4 గం.ల వరకు నడుపబడుతుంది. ఈ స్కూలుకు వచ్చే విద్యార్థులు [స్టూడెంట్స్, గృహిణులు] ఈ పై గంటల్లో ఏదో ఒక వేళలో వచ్చి నేర్చుకోవచ్చు. తాము స్కూల్లో ఎన్ని గంటలు బోధన విన్నదీ ఒక రిజిస్టర్‌లో నోట్ చెయ్యాలి. ఇది విద్యార్థుల వసతి సౌకర్యం కోసం చేసిన ఏర్పాటు. ఈ కోర్సు కాలపరిమితి 200 గంటలు. కోర్సు పూర్తి అయినవారు డిప్లొమా పరీక్షలకు కూర్చోవచ్చు.

— అనుపమ ★

## న్యూఢిల్లీ లేఖ

[7వ పేజీ తరువాయి]

ఒక బాంబుని జియా మీద ప్రయోగించలేడు. ఇద్దరూ కలిసి మాత్రం బాంబుని భారతదేశం మీద వెయ్యగలరు.

కొందరు భారతీయ జర్నలిస్టులు లేదా పత్రికా రచయితలు పాకిస్తాన్‌ని గురించి అర్థం లేని రాతలు రాస్తారు వీళ్ళలో కొందరు తాము లాహోర్‌లో ఉన్న రోజులు మరిచిపోలేరు. వీళ్ళని జియా కొంత దువ్వగానే ఆయనని పొగిడేస్తూ ఉంటారు. ఇలాంటి వాళ్ళలో అగ్రగణ్యుడు [లేదా అధముడు] ఖుష్వంత్‌సింగ్. ఒక మోటారుకారు మెకానిక్ తాను ఒక పెద్ద కారు ఫ్యాక్టరీ పెడుతున్నానంటే నమ్మేవాడు దేనినయినా నమ్మేస్తాడు. ఉచితంగా రానూ పోనూ విమానం టిక్కెట్టు [ఉచితంగా సారాయి] ఇస్తే కొందరు ఏమి చెయ్యమన్నా చేస్తారు. ఎప్పుడో అప్పుడు కాదర్‌ఖాన్ బాంబు పేలుతుంది. అప్పుడు వీళ్ళు ఏ టోక్యో నగరానికో [లాహోరుకి దూరంగా ఉన్న ఊరు ఏదయినాసరే] టిక్కెట్టు సంపాదించుకుని జపాన్‌లో గెయిషాలని గురించీ, అసభ్య చలనచిత్రాలని గురించీ రాస్తారు. అప్పటికి వీళ్లంతా 1000 సంవత్సరాల యుద్ధాన్ని గురించీ, బెనజీర్ ప్రజాస్వామ్యం కోసం చేసే విజ్ఞప్తులని గురించీ మర్చిపోతారు !

మహమ్మదీయ దేశం ఏది ప్రజాస్వామ్యంగా ఉంది ? ఏది శాంతియుతంగా ప్రవర్తిస్తోంది ? ఇస్లామ్‌లో యుద్ధాన్ని ప్రోత్సాహించే గుణం ఏదయినా ఉందా ? మహమ్మదీయ దేశాల నాయకులకి స్నేహితులు ఉండరు. ఇక స్నేహితులతో శాంతియుత సహజీవనం ఏమిటి ? ఈ దేశాలలో నియంతలే పాలిస్తూ ఉంటారు. పశ్చిమ ఆసియాలో ఎన్నికయిన అధ్యక్షుడు ఒకడే. ఇస్రాయిల్ అధ్యక్షుడు చెయిమ్ హెర్జొగ్. జెరుసలేమ్‌లో అరబ్బులూ ఉన్నారు, యూదులూ ఉన్నారు. ఈ నగరం వీధులలో తాము క్షేమంగా కాపలా లేకుండా నడిచి వెళ్ళగలమని చెయిమ్ హెర్జొగ్ ఇటీవలే అన్నాడు. పాకిస్తాన్‌లో జియా ఈ పనిచెయ్యగలడా ? లేకపోతే లిబియాలో గడ్డాఫీ ఆ పని చెయ్యగలడా ? శ్రీమతి గాంధీ లిబియా వెళ్ళి గడ్డాఫీని చూసివచ్చారు. బ్రిటన్ రాణి ఎలిజబెత్ జోర్డాన్ వెళ్ళి హుసెయిన్‌ని చూసి వచ్చారు. శ్రీమతి గాంధీకి నోబెల్ బహుమతి కావాలి, శ్రీమతి థాచర్‌కి బ్రిటన్‌కి జోర్డాన్ ఇవ్వగలిగిన కాంట్రాక్టులు కావాలి. స్టాలిన్‌కి, ముసోలినీకి శాంతిమీద ఎంత అభిమానమో గడ్డాఫీకీ అంతే. గడ్డాఫీ, జియా, ఖొమెయినీ - వీళ్లంతా చిన్నతరహా నియంతలు. తమ దేశాలలో పరాన్నభుక్కులుగా జీవించే వ్యక్తులు. భుట్టో కూడా ఇలాంటివాడే. అలాంటి భుట్టోని ఒక మహావీరుడుగా చిత్రించటానికి బెనజీర్ ప్రయత్నిస్తూ ఉంటే కొందరు భారతీయ పాత్రికేయులు ఆమెకి సాయపడుతున్నారు. ★

# హైదరాబాదు నోట్‌బుక్

## రాకేశ్ తలిదండ్రులకు సన్మానం :

ఆంధ్రప్రదేశ్ 'ఫ్రెండ్స్ ఆఫ్ సోవియట్ యూనియన్' సంస్థవారు ప్రథమ భారత వ్యోమగామి శ్రీ రాకేశ్‌శర్మ తలిదండ్రులు శ్రీ దేవేంద్రనాథ్‌శర్మను, శ్రీమతి తృప్తాశర్మను ఏప్రిల్ 7న ప్రెస్ క్లబ్బులో సన్మానించారు. సమష్టి వ్యోమగమనంవల్ల భారత సోవియట్ మైత్రిలో మరొక మధుర పరిణామం కలిగిందని మద్రాసులో సోవియట్ యూనియన్ కాన్సలేట్ జనరల్ శ్రీ విక్టర్ మల్సెనోవ్ అన్నారు. దక్కన్ క్రానికల్ సంపాదకులు, పార్లమెంటు సభ్యులు శ్రీ టి. చంద్రశేఖరరెడ్డి, విధానసభలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ మదన్‌మోహన్, ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ గజ్జల మల్లారెడ్డి, శ్రీ పి. నరసారెడ్డి, శ్రీ ఎం. ఆర్. శ్యాంరావు, హిందూస్తాన్ ఎయిరో నాటిక్స్‌లో ఉద్యోగి శ్రీ వ్లాడిమిర్ బిస్టోవ్‌స్కీ శర్మ దంపతులను, రాకేశ్ శర్మను ప్రశంసించారు. పెక్కు నగర సంఘాలు శర్మ దంపతులను పూలమాలలతో సత్కరించాయి. శ్రీమతి తృప్తాశర్మ ప్రసంగిస్తూ, తాను ప్రథమ భారత వ్యోమగామి తల్లి నయినందుకు గర్వపడుతున్నానని అన్నారు. ఇలాంటి అవకాశం తన కుమారునికి కలిగించినందుకు భారత, సోవియట్ ప్రభుత్వాలకు ధన్యవాదాలు చెప్పారు.

## పైడిరాజు పెద్ద ఫీట్లు :

అభినవ భీముడు కోడి రామమూర్తి వెల్లికిలా పడుకొని, వక్షస్థలంపై ఏనుగును ఎక్కించుకొని అందరినీ ఆశ్చర్యపరచడం చిన్ననాడు చూచాను. ఆయన శిష్యుడు విజయనగరం వాస్తవ్యుడు, 75 సంవత్సరాల వృద్ధుడు శ్రీ నాగుమళ్ల పైడిరాజు గురువుగారిలాగే ఏప్రిల్ 7వ తేదీన ఫతేమైదానంలో ఛాతీపై ఏనుగును ఎక్కించుకొని ప్రేక్షకులను ఆనందాశ్చర్యపరవశులను చేశాడు. పైడిరాజు చేసిన పనులన్నీ అలాటివే. వాటిని చూడడానికి వచ్చిన వేలాది జనం ఫీటు ముగిసేవరకు ఎంతో ఉత్కంఠతతో గడిపింది. వెల్లికిలా పడుకొన్న ఆయనరొమ్ముపై వంద కిలోగ్రాముల రాతిబండను పెట్టి, ఐదు కిలోల బరువైన సమ్మెటతో పగులగొట్టడం, మేకుల పలకపై పడుకొన్న అతనిపై జనంతో కిటకిటలాడే బండ్లు నడపడం— ఇలాటివన్నీ అద్భుతాలే. చివరకు ఏనుగును మోయడం— ప్రాణాయామంతో పరుండిన పైడిరాజుపై నెహ్రూ జూలాజికల్ పార్క్ నుంచి వచ్చిన ఏనుగు యథాలాపంగా నడిచింది. జనం వూపిరి బిగబట్టి నిక్కిచూచారు ఆ రెండు నిముషాలు. ఆ ఏనుగు శ్రీ పైడిరాజు పెంపుడు జంతువు కాదు. పెంపుడు జంతువైతే బరువు అనీ అనకుండా నిలుచోవచ్చు. ఇది పార్క్ జంతువు. కనుక ఫీటు చేసే వ్యక్తి కనుసన్నలలో మెలగవలసిన అవసరం లేదు. గురువుగారి జయపతాక నిరంతరం రెపరెపలాడేట్టు చేస్తున్న శ్రీ పైడిరాజును, 75 సంవత్సరాల వృద్ధును మనసారా అభినందిస్తున్నాను. గురువు సాహసాన్ని, శిష్యుని సాహసాన్ని కనులారా కాంచిన నన్ను నేను అభినందించుకొంటున్నాను. ఈ ప్రదర్శనకు ముఖ్య అతిథిగా వచ్చిన ముఖ్యమంత్రి శ్రీ రామారావు యోగం, వ్యాయామం, శరీరారోగ్యాన్ని, మనశ్శాంతిని కలిగిస్తాయని వివరించారు.

## తెలుగు వెలుగులకు ఘనసన్మానం :

వివిధ రంగాలలో విఖ్యాతులైన రాష్ట్ర, రాష్ట్రేతర, విదేశాంధ్రులు నూటపదేను మందికి రక్తాక్షి ఉగాది సాయంకాలం జూబిలీహాలు ముందున్న పచ్చికబయలులో ఘనసన్మానం జరిగింది. మాజీ ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య ప్రధాన పోషకులుగా, మాజీమంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి అధ్యక్షులుగా, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, శ్రీ కె. రోశయ్య ఉపాధ్యక్షులుగా, శ్రీ ఆర్. వి. రమణమూర్తి ప్రధాన కార్యదర్శిగా నగరంలో ఏర్పడిన కళావేదిక ఈ సన్మానం ఏర్పాటు చేసింది. పచ్చిక బయలులో సన్మాన్యుల పేర్లున్న బ్యానర్లు కట్టారు. దాదాపు వేయి మంది పట్టే షామియానాను అలంకరించారు. పాండుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నరు శ్రీ కోన ప్రభాకరరావు అధ్యక్షత వహించారు. రాష్ట్ర గవర్నర్ శ్రీ రామలాల్ ముఖ్య అతిథిగా వచ్చారు. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ అర్జున్ సింగ్ వివిధ రంగాల తెలుగు వెలుగులను కాశ్మీర్ శాలువ, కళా సరస్వతి పతక, కళా ఖండంలతోను పూలమాలలతోను సత్కరించారు. మొదట శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయను కళా సరస్వతి బిరుదుతో గౌరవించారు. తెలుగు వెలుగులుగా దాదాపు 250 మందిని సన్మానిస్తానని కళావేదిక మొదట ప్రచురించింది. కాని సన్మాన సమయానికి దాదాపు నూట పదేహేను మందే హాజరయ్యారు. సన్మానం పొందిన వారిలో శ్రీయుతులు ఉప్పలూరి గణపతిశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, గ్విన్, దివాకర్ల వెంకటావధాని, సి. నారాయణరెడ్డి, దాశరథి కృష్ణమాచార్యులు మున్నగు కవి పండితులు, జనరల్ కె.వి. కృష్ణారావు, నార్ల తాతారావు, ఎన్. కొండలరావు, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్, శివారెడ్డి వంటి ప్రముఖులు, నటరాజ రామకృష్ణ, కోరాడ నరసింహారావు, యామినీ కృష్ణమూర్తి, షేక్ చినమౌలానా, ఎల్లా వేంకటేశ్వరరావు, ఈమాని శంకరశాస్త్రి వంటి నాట్యసంగీత వేత్తలు, పి. టి. రెడ్డి, కె. రాజయ్య, పి. ఆర్. రాజు వంటి చిత్రకారులు, నీలంరాజు వేంకట శేషయ్య, తిరుమల రామచంద్ర వంటి పత్రికా రచయితలు, చలనచిత్ర గాయనీగాయకులు మున్నగు వారున్నారు. శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, కుమారి వాసిరెడ్డి సీతాదేవి, డాక్టర్ బాల మురళీకృష్ణ వంటివారు సన్మానాన్ని నిరాకరించారు.

శ్రీ దేవేంద్రనాథ్ శర్మ
శ్రీమతి తృప్తాశర్మ



## ఉపశ్రుతి :

పంజాబ్ కల్లోలాన్ని గురించిన వార్తలు ఈ విధంగా ఉంటున్నాయి. చెదురుమదురుగా అమృత్‌సర్ జిల్లాలో నాలుగు హత్యలు, భటిండా జిల్లాలో ఆరు గృహదహనాలు, ఫరీద్‌కాట్ జిల్లాలో మూడు బ్యాంకు దోపిడీలు, ఫిరోజ్‌పూర్ జిల్లాలో రాస్తారోకోలు, గురుదాస్‌పూర్ జిల్లాలో నాలుగు దేవాలయ విధ్వంసాలు, హోషియార్‌పూర్ జిల్లాలో ఐదు పరిశ్రమల లూటీలు, జలంధర్ జిల్లాలో నాలుగు దాడులు, కపూర్థలాజిల్లాలో కొన్ని కత్తిపోట్లు, లూధియానాలో కొన్ని గిడ్డంగుల కాల్చివేతలు, పాటియాలాలో కొన్ని అపహరణలు, రూప్‌నగర్ జిల్లాలో కొన్ని రవరవలు, సంగ్రూరులో కొన్ని సంగ్రామాలు మినహా రాష్ట్రమంతటా ప్రశాంతి నెలకొన్నది. (పంజాబులో వున్న జిల్లాలు మొత్తం 12)

**— తిరుమల రామచంద్ర ★**

## ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

పదాలు మాత్రం ఉండేవి. మూడు వరసల్లో-మొదట ఇంగ్లీషు పదం—తర్వాత దాని ఉచ్చారణ పద్ధతి, మూడవవరసలో తెలుగు అర్ధం ఉండేవి చివర కొన్ని వాక్యాలు కూడా ఈ పద్ధతిలోనే ఇయ్యబడేవి. మా అన్నగారు నా చిన్నతనంలో ఈ పుస్తకం తెప్పించి నాకిచ్చారు. ఇతరుల సహాయం లేకుండా స్వయంగా కృషి చెయ్యడానికి ఈ పుస్తకం బాగా తోడ్పడింది.

రెంటాలవారు ఇలాటి పుస్తకాలనే కాదు. శతకరత్నావళి అనే పేరుతో శతకాలను, కథా రత్నావళి అనే పేరుతో చక్కని పెద్ద కథలను ప్రకటించారు. కేసరీ విలాసం వారి చిన్న నవల. ''మయూర కథా మండలి'' అనే పేరుతో సులభ గ్రాంథిక భాషలో చక్కని కథలు ప్రకటించారు. వాటిలో నేను ''సుకన్యా మయూర'' కథను చదవడం బాగా గుర్తున్నది. ఆయన వకీలు కావడంవల్ల ''ఇండియన్ పీనల్ కోడ్, హిందూ లా'' మొదలైన పెద్ద న్యాయశాస్త్ర గ్రంథాలను తెలుగులో ప్రకటించారు. అవన్నీ వారి ''జనోపకారిణి'' ప్రెస్సులో మేలు కాగితములపై చక్కగా అచ్చయేవి. అప్పట్లో తెలుగులో చక్కగా అచ్చువేసే ప్రెస్సులలో అది ప్రధానంగా ఉండేది. ''జనరంజని'' మొదలైన మాసపత్రికలు అంతకుముందే ఉన్నప్పటికీ పంతులుగారి ''జన వినోదిని'' అన్నిటికన్నా ఎక్కువ ప్రచారంలో ఉండేది. అందులో హాస్య కథలు, విశేషాలు వినోదాన్ని కలిగించేవి. ఆ కాలంలో దివాలాతీసిన అర్బత్‌నాట్ కంపెనీ (ఆంగ్లేయుల సంస్థ)లో తమ సొత్తును ఎక్కువ వడ్డీ ఆశతో నిక్షేపించి నష్టపోయినవారి గోడు తమాషాగా వ్రాయబడేది. ఒకటి, రెండు సంచికలు నేను చదివినట్లు బాగా జ్ఞాపకం :

''ఆంధ్రపత్రిక'' లోని ప్రకటన వల్ల ''విక్టోరియా డిపో'' సంగతి విజయనగరం సమీపంలో ఉన్న మావూరి వారికి తెలుసు. ఆ డిపోలో పంతులుగారి పుస్తకాలే కాకుండా వారి మందులు, ఫ్యాన్సీ వస్తువులు, స్టేషనరీ కూడా దొరికేవి. మా అన్నగారు రంగు రంగుల సిరా పౌడర్లు, కొన్ని వస్తువులు తెప్పిస్తూ ఉండేవారు. పుస్తకాలు కూడా కొన్ని వస్తూ వుండేవి ! డిపో కేటలాగు కూడా ఆకర్షణీయంగా ఉండేది. (ఇవి నా 8 ఏళ్ల వయస్సునాటి జ్ఞాపకాలు.)

—బులుసు వేంకటరమణయ్య ★


Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.

తొలిప్రొద్దు సౌందర్యాల
కలనేతల వడపోతలు

రాజ్‌కమల్
కాటన్ ప్రింటెడ్ చీరలు

రాజ్‌కమల్ చీరలో
సినీలాకాశపు తార రాధ.




kiron/rks/841